శ్రీరస్తు.

శ్రీ గురుభ్యో నమః

స్త్రీపురుషుల కత్యంత పురుషార్థకంబగు

మహాపతివ్రతా మాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము

మొదటిభాగము.

ఇరువది మహాపతివ్రత కథలుగల

ఈ గ్రంథము.

చంద్రగిరి-చిన్నయ్యనాయనిగారిచే

రచియింపబడి

త. శేషాచలముగారిచే

పరిష్కరింపబడి

కో. లక్ష్మణమొదలియారువారిచే

చెన్నపురి:

శ్రీవేణుగాన ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1927

# విషయసూచిక



శ్రీ భక్తవిజయము విషయసూచిక

సంపూర్ణము.

# పీఠిక.

---

ఇందువలన సమస్తమయినవారలకు తెలియఁజేయు విజ్ఞాపనము యనగా:—

తత్పూర్వ మహాకవులచేత వ్రాయఁబడిన యీపతివ్రతకథలు పది ను, ఇందు అనేక కథలు విడిచి వ్రాసియుండిరి. అట్టి పుణ్యస్త్రీల కథలను కొన్నిటిని ఇందులో జేర్చి సాంగోపాంగముగా యిరువది మాత్రము యిందులో ముద్రించినారము.

ఇది మొదటిభాగము.

రెండవభాగమున్ను ముద్రింపుచున్నారము.

ఇట్టి పుణ్యస్త్రీల పతివ్రత కథలను చెల్లునుగనఁ స్త్రీ పురుషుల సత్యువయుక్తముగాను, అతి పదపోతకముగాను, చదువచదువ భక్తి జ్ఞానము గలుగునట్లుగాను, సమస్తస్త్రీలైనవారు క్రూరమునువదలి రమవలంబించి నడచునట్లుగాను, పతిభక్తి అధికరించునట్లుగాను, నడవడికలవిరాదు నడచునట్లుగాను, బుద్ధికుశలతలు మించునట్లుగా త్యకృత్యములయందు శౌచులైయుండునట్లుగాను, వారు మితిలేని మంబున మగ్నులై మోక్షంబుజేరుటకు తగిన పుణ్యధర్మము బులగు కథల పూర్వకంబుగా జ్ఞానంబు దెచ్చుకొని నడుచుచున్నట్లు గ్రంథంబున వ్రాసియున్నారము. గావున పతులగువారున్ను, తల్లిదం డ్రులున్ను, మిత్రులున్ను, బాంధవులున్ను, యీగ్రంథంబు కన్నను విన్న వెంబడే గొనిపోయి వారి వారి సుతులకున్ను, కుమార్తెలకున్ను, ద్రకున్ను, తమకుగల వారందరికిన్ని నొక్కొక ప్రతియిచ్చి వారిం నిచ్చి విని పరమానందంబునుంబొంది రెండవభాగంబును వారలచేతి ంచి వారల నభివృద్ధిచేయవలయు. అట్లుచేయుటవలన కలుగు ఫలం ంతనియని పలుక ఆదిశేషునికైన తరంబుగాదు. ఇది నిజంబునిజంబు,

## ఇందుగల పతివ్రతల నామంబులు.

సునీతి, జయప్రద, చంద్రమతి, దమయంతి, సీతాదేవి, సంధ్యా
వళీ, చారుమతీ, దేవహూతి, అనసూయా, అరుంధతి, నళిని, లోపా
ముద్రా, సావిత్రీ, చంద్రవదనా, సుమతీ, సురభీ, ప్రభావతీ, సుముఖి
పుష్పవేణీ, అమృతవల్లి, యిట్టి పుణ్యస్త్రీలు మొదలగు యిరువది పతి
వ్రతల మాహాత్మ్యములు వ్రాయఁబడినది. వీటి నొక్కొక్కటిని తప్పక
చదివి యిందుగల విశేష్య విశేషణములు గమనించుడీ. దీనిని అంగీకరిం
చుడీ, కనులగాంచుడీ, బుద్ధికెక్కియుడు, సారాంశములను దెలియుడీ, యింక
కన్నరుచి యొందు లేదను అమృతరసమిదే గనుడీ. గనుడీ.

శ్రీమదఖిల భువనభోమయ విలసితాండాంశ కోటీరవ బృందంబు
లకు బ్రహ్మాండనాయకుండై లీలామానుషవిగ్రహుండై, సచ్చిదానంద
స్వరూపుండై, సర్వాంతర్యామియై, సాకారనిరాకారనిరాభాసుండై
బిందునాదమనితుండై, నిరుపమనిరవధిక సుఖసందాయియై, పునర్వృత్తి
రహితుండై, బ్రహ్మానందసుఖసముదాయకుండగు భగవంతుని దివ్యచర
ణారవిందములకు నమస్కరించి వారి యనుగ్రహంబున యీగ్రంథకర్త
యగు నేను వ్రాయఁబూనునది యెద్దియనగా:—

కృత త్రేతాద్వాపరయుగంబుల దేవతలు భూలోకమునకు విజ
యముచేసి మర్త్యులతో కలసి ఆటపాటలయందు దేలుచు వారందరును
కేళీవిలాసంబుల మీరుచు అన్యోన్యమైత్రులందొలగు ఆహ్లాదంబుమించు
చుండిరి. ఇట్లుండగా యుగము బుట్టిన కొన్నిదినంబులకు భూలోకంబునకు
దేవతలువచ్చి మభయము జెంది రాకలుమానిరి.

అట్లుండ నొకనాడు భరతఖండంబున బదరికాశ్రమంబని నిర్మాను
ష అరణ్యంబులో తపము జేయుచున్న సుశీలమహాముని సన్నిధి కేతెంచిన
నృమామహేశునింగాంచి ప్రియపూర్వకముగా వందనములాచరించి ధూ
పదీపనైవేద్యములనుపచరించి శ్రాంతులం జేసి వారికుశలములడిగి ఆనం
దముప్పతిల్లి వుల్లాసమున మగ్నులైయుండె.

అప్పుడు మునిపత్నియగు సుశీలి మహేశ్వరికి మ్రొక్కిన నాశం
కరి సుశీలింగాంచి ప్రియపూర్వకముగా ఆలింగనము జేసి చిరునగవులెగ
య పూగొమ్మా! కమ్మనిల్లునికేని దేలనిగన్యా! సుశీలీ! నీబుద్ధిచిత్త
ముల దృఢమునకు నేనత్యంతసంతుష్టి నందితి ఓపతివ్రతా? నావల్ల వల
యు వరంబు లేవియున్న గోరుమిచ్చెదనని బల్కిన మహేశ్వరింగాంచి
నమస్కరించి ఓతల్లీ! కమ్మనిల్లునికాని కేలం దేలని బల్కితినని వరంబేమి
పతివ్రతలనగా నేమి యీరహస్యములు నాకు వక్కాణింపుమని వేడిన
నాదేవి సుశీలింగాంచి ఓతల్లీ! లోకంబున మర్త్యులు శృంగారాదిచేష్టలకు
లోబడి పుత్రకళత్రులుంబడసి మెలగి పతివ్రతలై దైవభక్తిగలవారలగు
దురు. నీవట్లులేక పుట్టినది మొదలు యీవరకులో కన్నెరికంబుచెడక నేష్ట
బవలంబించక యేమెరుగని పిన్నవలెయుండి ఋషిపత్నియైభర్తకు పరిచ
ర్యలుచేయుచున్న నీమాహాత్మ్యమువలన నుమ్మింతదూరమురావచ్చితిని
గావున నీకు వలయువరములు కోరుకుంటిగాని మరొంకు లేదని జెప్పిన
దాక్షాయణింగాంచి ఓతల్లీ! నీ యనుగ్రహమున నాపతివల్ల యైశ్వర
ములు గలిగియున్నదానను నాకేదియు చింతలేదు. నీమనంబు మాత్రము
నాయందుండ కరుణయిమ్ము. యిదే నావరమని జెప్పి అమ్మా! లోకము
న యింతులు సంసారమువదలి యెట్లు పతివ్రతలైచరించుచున్నవారలు
అది నాకు సవిస్తరముగా దెలిపించండని బలికినసుశీలింగాంచి పార్వతీదేవి
యిట్లని జెప్పందొడంగె.

మహాపతివ్రతామాహాత్మ్యంబను స్త్రీభక్తవిజయము
పీఠిక సంపూర్ణము.





శ్రీరస్తు.

శ్రీ రామకృష్ణ పరబ్రహ్మణేనమః.

సకల స్త్రీపురుషుల కత్యంత పుణ్యాకరంబగు

మహా పతివ్రతా మాహాత్మ్యంబను

# స్త్రీ భక్తవిజయము.



## ౧ సునీతీదేవి ప్రభావము.

ఓంకారస్వరూపమైన ప్రపంచము చతుస్సముద్రమధ్యమున వెలయు నవఖండమునం బ్రసిద్ధి కెక్కిన యీభరతఖండమునందు ఆదియుగంబనెడి త్రేతాయుగమున కమలపురమను పట్టణము నేలుచున్న స్వాయంభువయను యతని భార్యయగు దశరూపవల్లికి ప్రియవ్రతుడు ఉత్తానపాదుడను యిరువురు జనించిరి. అందు రెండవవాడగు ఉత్తానపాదుకు తన రాజ్యభారం బప్పజెప్పి మకుటాభిషిక్తుం జేసి సంసారము రోసిన స్వాయంభువ మనుపత్ని సమేతముగా అరణ్యము ప్రవేశించి తపంబుబూని విష్ణుపునిగని పదవులందుకొనియె. అంత కొంతకాలమునకు ఉత్తానపాదమహారాజు సునీతి సురుచి యను రెండు భార్యలుంబడసి సుఖముగ రాజ్యభారము జేయుచున్నంత పట్టమహిషియగు సునీతి శేషియు సుచిపతియు సుప్రతివ్రతయునై భర్త

పాదమేగతియనియు భర్తనామమే తిరుమంత్రమనియు వారిరూపమే బ్రహ్మస్వరూపమనియు వారిసేవయే దైవమనియు వారికిసేయు నుపచర్యలే త్రికాలసంధ్య జప తప అనుష్ఠానములనియు తన మనమ్మునమున నమ్మిక [illegible]మ్ముగనెంచి సదాకాల ధ్యానమున చేయుచు భర్తను నుపచరించుచు యుండెను. రెండవభార్యయగు సునీతియో దయా దాక్షిణ్య భయము లజ్జ మొదలగు గుణములుమాని [illegible]యై [illegible]మున తనభర్తపైబడికిడు నడి [illegible] మోహింపజేసి [illegible] ప్రకృతులందేలిం చి వేశ్యవలె శృంగారించి మోహింపజేసి [illegible] నొప్పించి అందు లో స్వభావమునుంచి తెలుకు బెళుకులవలపించి [illegible] గమకించి భర్తను వశపరచుకొని సునీతియను సవతిని [illegible] దానిపేరెత్త నీయక తనకుమారుండగు [illegible] నిలుపుకొనియెను. అట్లే ఉత్తానపాదమహారాజున్ను రెండవ భార్యయొక్క శృంగారము దానికివశుడై మోహసాగరమునందు మునిగి పట్టపుదేవియు నిల్లాలు ప్రియముమరచి గోయింపుగలవాఁడై సురుచియందు అత్యంతమోహమువేసుకొనై యుండెను. ఇట్లుండగా కొంతకాలమునకు గర్భవతిగాయున్న సునీతి మంచిలగ్నమున శుభదినమున సుముహూర్తమున నుతికెక్కిన నొకపుత్రుని గనెను. ఇది విన్న మాత్రంబున సురుచి సునీతిభాగ్యమునకు దాక్షిణ్యంబులేక కన్నీరొలుక రాజుసన్నిధింజేరి [illegible] వెడలగొట్టుమని చెప్పినమాటలవిన్న రాజు ఆమాటలకు నంగీకరించి మంత్రినింబిలచి సునీతిని నగరికావలవెళ్ళ గొట్టుండని చెప్పినయంతటను సుబుద్ధియగు మంత్రి మనంబున దిగులొం ది కందినమోముతో సభాస్థానమునకు విజయంచెప్పి పట్టమహిషుంగాంచి ఆబిడ్డకు పేరొకటిగాకుము నిర్మాణించి అందులో నివసింపచేసి వలయువాటిని వొసంగి విధవశంబని ఆపెనునూరార్చి పుత్రునికి ధ్రువుండని నామంబిడి ప్రత్యేకంబుగా నిలిపెను. అంతసుచీమతియగు నాసునీతి తనపుత్రుని దిన దినంబున అతిగారాబముతో బెంచుచు అతిభద్రమున గాపాడుచు తనభ ర్తను సదా నెంచుచు దిగులొందుచు తానేనూరార్చుకొనుచు కొంతకా లంబున యుక్తవయస్సువచ్చిన తనపుత్రునకు విద్యాభ్యాసంబు చేయిం చి బడికిపంపెను. ఆధ్రువుండతిబుద్ధిమంతుండై దినదినంబున విద్యగ్రహిం చి పరిశీలుండై చదువుకొనుచున్న బాలురతో నొకఁడు తండ్రిలేనిబిడ్డ

యని తలమీదమొట్టెను. అదిగాక తక్కినబాలురున్ను విన్నవారున్ను పకపకనవ్వుచు చేతులుతట్టి కెక్కిరలించుచు పరిహాసించిన వాటినిగన్న ధృవునిమనం బతిసిగ్గొంది చింతజెంది యుపాధ్యాయులవద్ద పాఠ మొప్పగించి సెలవంది తనమందిరంబుజేరి శోకంబుమీరిసొటసొటల నెయ్యిజారి తల్లినిజేరి ననుగన్నతల్లీ నాదరణగల్పతల్లీ ప్రతిదినము తల్లీ నిన్నుమాత్రం జేయ చూచుచున్నానేగాని యెన్నడు నాతండ్రి గానైతిని. వారేడి? యందుడాగిరి? ఎచ్చోటయున్నవారు? అచ్చెరువొందక నిజంబుగ ఆనతియ్యవలయునమ్మా అని యడిగినకుమారునింగాంచి సునీతి అతిదుఃఖసాగరంబున మునిగి కన్నీరు దొరిగి మనంబుగరిగి పుత్రునాలింగనము చేసి ముద్దిడి ఓరిపుత్రశిఖామణీ! ఇన్నిదినంబు లూరకుండి యెన్నడులేక నేడు నీతండ్రియందు ప్రియముకలిగినట్టి కారణమేమొ నేనెరుగనైనను నీతండ్రి యింక కొద్దిదినంబులలోపల నిచ్చోటికే తెంచును అదివరలో నీవతిబుద్ధిమంతుండవై సుశీలుండవై విద్యలభ్యసించుచుయుండుమప్పాయని నూరార్చిన వినక వాడతిమూర్ఖంబున పట్టువదలక ఓతల్లీ నీవెన్ని నెపంబుల నేమరించినవినను. ఇప్పుడేమాయప్పయుండుచోటు తెప్పున చెప్పవలయు. తండ్రింగానక నామనసు నెమ్మతించదు; ఆహారంబొందదు; దాహంబుతీరదు; ఉత్సాహంబుమీరదు; దుఃఖంబుసనుసదు అని వేడిన పుత్రునింగాంచి సునీతి యిట్లని చెప్పందొడంగె.

ఓరీ మచ్చికంట్లునెచ్చ యిచ్చ లెచ్చుముచ్చటలుదీర్చిన నాముద్దుపట్టీ! నీతండ్రి బహుదూరమున యున్నాడని యెంచవద్దు. ఇదేనగరిలోపల అంతరిక్షంబున రత్నసోపానంబుపై దివ్యసింహాసనంబునకొలువుండి నవమన్మథాకారుండై తేజరిల్లుచున్నవారేనీతండ్రియని మందలించినమాటలు విన్నమాత్రంబున ఆనందోత్సవంబున దేహంబు పిక్కటిల్లి వికాసవదనుండై తల్లింగాంచి పాదంబులపైబడి నమస్కరించి యీక్షణంబున నాతండ్రిగాంచి వచ్చునట్టి ఆశీర్వాదంబు లిమ్మా మాయమ్మాయని వేడిన పుత్రుంగాంచి అమ్మ నీతండ్రింజూచి వత్తువుగాకయని ఆశీర్వచనంబులచే నూరార్చిపంపెను. అంతధృవుం డతిమోదంబున శీఘ్రగామియై నగరిలో ప్రవేశించి సభాస్థలింజేరి సింహాసనాసీనుడై యున్న తండ్రింగాంచి సంతోషముమించిపొంది నవరత్నసోపానములనుదాటి తనతండ్రివొడిలో గూ

ర్భుండదలంచి సమీపమునపోయుసంత తన పినతల్లియగు సురుచి గర్భని
బునం గుదయించిన ఉత్తమునను తనతమ్ముఁడువొడిలో గూర్చుండబెట్టుకొం
డుపలాలనచేయుచున్న సమయమున గావునను పినతల్లి సమీపమున యు
న్న సమయముగావునను రాజు పిసికన్నెత్తిజూడక అలక్ష్యమైయుండుటను
ధృవుడుగమనింప తండ్రియనేశ్రద్ధచే సమీపించి సింహాసనముబట్టిమె
క్కతలఁచ పిన్నతల్లియగు సురుచిగాంచి వానిని సింహాసన మెక్కనీయక
వానిబట్టిత్రోసి ఓరిచిన్నవాడా ధృవుడా నీవు నాసవతిగర్భంబునబుట్టినం
దుకును పాపియగుటచేతను నవరత్నఖచితమగు యీసింహాసనమెక్కఁగో
రితివేని మెలైనతపంబుసూని సాధు గోబ్రాహ్మణ పూజలుగని హిరణ్య
గోభూదానాది అన్నదానంబుల ప్రదాతృత్వంబుగాని చానడిసత్రాదిమం
తపంబులు నిలిపి భూమిన పుణ్యవంతుడని పేరుబూని నాగర్భంబునబుట్టి
తివేని అతిసులభంబున యీసింహాసనంబుజెందుట కేమిసందియంబులేదు
కాబట్టి నీవుఅరణ్యంబుజేరితపంబుగోరి శ్రేష్టత్వంబుమీరిపుణ్యవంతుడని
పొగడచేరి రాపోరాయని మెడబట్టి నెట్టుకత్రోసెను.

అంత ధ్రువుఁడతిచింతాక్రాంతుడై సభాస్థలి ననేకజనంబులకు
యెదుట తన్ను మెడబట్టినెట్టిన గొట్టుతనంబున తనకుగల అవమానంబు
నకున్ను తండ్రిగారుచూచియు నిజముల కేమి నూరకబలుకక సమ్మతించి
యున్నందుకున్ను దుఃఖం బధికరించి నొప్పకింత ధ్వనితో నిక్కినిక్కి యే
డ్చుచు తనతల్లివద్దకేగి తనపినతల్లి బలికిన కాఠిన్యపుమాటల నంతయు
జెప్పి తన్ను ఆసనమెక్కనీయక దిగునబడద్రోసిన వాటినంతయు సవిస్త
రంబుగాజెప్పి దుఃఖించుచున్న కొమారుని నూరార్చి వానిశోకంబుదీర్చి
హితవచనంబులందేర్చి అచ్చోట జరిగిన సమాచారంబెల్ల సావధానము
గా నాథులచేవిని సునీతి తనమనంబునగల కష్టములను పుత్రునికిజూపక
ఓరిపుత్రకా ధ్రువా యింతమాత్రపు అల్పసుఖంబులకాశజెందితివాయిం
తకన్న మేలైనసుఖంబులులేవా యీసుఖంబులు కరువా యిదికల్పతరు
వాయుదెంతవరవా లేకబరువా యీసుఖంబులుకొద్దిదినంబులేకాని యె
న్నడుండవు మనలగాపాడవు మన వెంబడిరావు తుదకేమిలేవు కాబట్టిజెప్పె
దనువినుము పుత్రశిఖామణి ఓరిముక్తచింతామణి యీగేహ ప్రపంచమ
నెడు అండాండబ్రహ్మాండంబులను అనంతకోటి అండస్వరూపముల కా

ధారవస్తువై యుండునదియేదియో దాని యక్షకిన్నరకింపురుష గరుడ
గాంధర్వ సిద్ధవిద్యాధరాప్సరాది ముప్పదిముక్కోటిదేవతలున్ను నలు
వదినాల్గు వేలఋషులున్ను యింకా ననేకదివ్యజ్ఞానతపోధనులున్ను వారి
వారి మనోవాక్కాయములకు అందక యుండు మేలుగుపదవి యనుభవిం
చుట యీమానుష్యజన్మమునకు ఫలముగాదా. అట్లుండ అల్పసుఖం
బనెడి సింహాసనంబు గోరుటేమిఫలము నాముద్దులయ్యా వద్దురాయని
సంతృప్తునిగావించి యికకొద్ది దినములలో నీతాతగారనుభవించెడుపదవి
నీకబ్బుచున్నది భయపడవలదు యిందుకై వ్యసనంబువలదువలదని జెప్పిన
తల్లింగాంచి ఓయమ్మా నీవు చెప్పుచున్న పదవియెందున్నది అందుకైనవారె
వరు యెవరిచేకలుగును యెట్లుగవలయును వాటిని చెందెడి మార్గమెట్లో
వాటినెల్లనాకానతీయు మమ్మాయని కాళ్ళపైబడి నమస్కరించి వేడు
కొన్న పుత్రునింగాంచి సునీతి యారహస్యంబునెల్ల వివరంబుగ జెప్పిన
మాత్రంబున ధ్రువుండతిసంతుష్టాంతరంగుండై పురంబువిడిచి అరణ్యం
బుజేరి ముళ్ళచేతను రాళ్ల చేతను గాలిచేతను యెండచేతను కొట్టుబడి
పవనము భ్రమింగి ఆకులుదిని నీళ్లుత్రాగి మంచులోడాగి గుహాలడిగి ఆక
లిచేయునిగి మనసుకరిగి భక్తిచెలగి నారదులపాదంబుల కెరగి వారి కృప
దేశంబుమీరి వనంబు జేరి దానంబుగోరి తపంబుపూరి శ్రీమన్నారాయ
ణునిచేరి ప్రార్థించిన వారరుదగు వరంబులియ్య అందుకొని తన పట్టణం
బుజేరి తల్లినిగని నమస్కరించి తానుగొనివచ్చిన వివరంబులను వివరించి
మచ్చికతో తానుందల్లియు నెమ్మదిగ యున్నంత ఋషిశ్రేష్టుడగు నారద
మహర్షి వుత్తానపాదమహర్షి వద్దంజేరి ధ్రువునిసన్మానంబులును వాడుజెం
దిన వరమాహాత్మ్యంబులను జెప్పినవిని రాజు అతిసంతుష్టాంతరంగుండై తన
మొదటిభార్యయగు సునీతిని తనపుత్రుడగు ధ్రువునిరప్పించి నగరిలో
యెప్పటియట్ల యుంచుకొని సుఖాసీనుండై కొద్దిదినంబులకు ధ్రువునికి
పట్టాభిషేకంబు గావించి రాజ్యంబొప్పచెప్పి వుత్తానపాదమహారాజున్ను
తన పట్టమహిషియగు సునీతియు యిరువురులు గూడి అరణ్యంబుచేరి
ఘోరతపంబుమీరి మోక్షంబులం దేరిరి.

సునీతిదేవిప్రభావము ముగిసెను.



శ్రీరస్తు.

# స్త్రీభక్తవిజయము.



## ౧. జయప్రదాదేవి ప్రభావము.

ఈ సకలవిద్యాప్రఖ్యాత శౌజన్య సుగుణంబులు దేలిన రెండవ యుగంబున విశాలనగరపాలితుండై సోమదత్తమహారాజని పేరువహించిరి పంకజవల్లి యను ఉత్తమపత్నీసమేతుండై రాజ్యంబు జేయుచుండ నాపత్నియగు పంకజవల్లి భర్తయం దనురాగంబు మీఱి భర్తయే దైవ మని నిశ్చయించి భర్తపాదములకు నమస్కరించి యేమరుపాటులేక భర్తకార్యంబు లతిజాగ్రతగా నొనరించి సదాధ్యానించి మనసాపూజించి మించి యెన్నికతో నిశ్చలభక్తిగలిగియుండెను. ఆసోమదత్తమహారాజు మనునీతిదప్పక ఘనంబగు రాజ్యంబుపూని సత్యమనుభయంబుగొని పుణ్యమున కెదురొడ్డని అతిజాగరూకుడై రాజ్యంబు చేయుచుండ ధనకనక వస్తువాహనాది అష్టయిశ్వర్యంబులు గలిగియు సంతానములేమిచే చింతనొంది భార్యాదోడ్కొని వింతారణ్యంబు ప్రవేశించి మునుల పొంత జేరి శిశ్రూషలు జేసి దినంబులు గడుపుచుండిరి. అంత కొంతకాలంబునకు రాజున్ను రాజ్ఞియు చేయువుపచర్యలకు సంతోషించి పుత్రకామేష్టియాగము గావించి అందుదయించిన అవిర్భాగంబను పాయస

మును పంకజవల్లికొసంగి ఓరాజా నీవుకోరినవచ్చినసంతానము నీకుఫలిం చునుగాక నీవు నీభార్యసమేతుఁడై రాజ్యంబు జేరి సుఖంబుననుండుము పోయిరమ్మని జెప్పిన మునిపుంగవులకు నృపుండు తనభార్యయు సాష్టాం గనమస్కారములుచేసి సెలవంది తనరాజ్యంబుచేరి యెప్పటియట్లరాజ్య భారంబుచేయుచున్నంత కొంతకాలమునకు సౌభాగ్యవతియగు పంకజ వల్లి జంటబిడ్డలగనెను ఆమాత్రమున రాజువిని సంతుష్టాంతరంగుఁడై ఆ నందమువ్వెళ్లి యిరుకరములు చతురస్రములై శరీరము పిక్కటిల్లి పు ణ్యాహవాచనాదికృత్య మనుష్ఠించి బ్రాహ్మణోత్తముల రావించి మంచి లగ్నమున నిం చిన దానముల వంచనలేక గోభూహిరణ్యాదుల భూదేవ తలకొసంగి తృప్తిజేసి జాతకనిర్ణయములు జేయుచున్న సమయమున యేవారి అనుగ్రహమున యీపుత్రులు జన్మించిరో అట్టిమహర్షులేతెంచిన విని రాజెదుర్కొనితోడిదెచ్చి షోడశోపచారమున నుపచర్యములుమిం చి ఆశీర్వచనములనుండనిచ్చి భూమిపైబడి సాష్టాంగనమస్కారముజేసిన రాజునుంగాంచి ఆశీర్వచనముల దృష్టిజేసి ఓరాజా తమపుత్రులనిరువురను స్వర్ణపల్లెరంబున గొని తెమ్మని యాజ్ఞాపించిన నతం డతిజాగ్రతతో భయభక్తితో సేవకుల మూకలతో తదయ ప్రీతితో తన హస్తములతో గొనివచ్చి మునులముందిడిన నమ్మహర్షులు అతిసంతోషమున అందు గల మొగశిశువునకు ఆశీర్వచనములుకూరి అక్షింతలుయెత్తి వారిశిశువు పైమీరి తేరినమననమున ఓ సుమతీంద్రా సుమతీంద్రా యని ముమ్మారు బిలచి ప్రసిద్ధముగ నామంబిడిరి. అత్యానందభరితులైన అమ్మహర్షులు పల్లెరమునగల ఆడశిశువునుగని ఓజయప్రదాదేవి యని ముమ్మారుబిలచి నామము ప్రసిద్ధిగావించి సూనములు ప్రవహించి రాజునకు హెచ్చరిం చి జాగ్రతలు గలిగించి వారతి సంతోషము మించి మంచి పండువెన్నె లతీరు ప్రకాశించి రాజుచే సెలవడసి తమ నివాసంబులగు అరణ్యావా సము జేరిరి.

అంత సోమదత్తమహారాజు తన బిడ్డలను దినక్రమమున గారా బముతో శుక్లపక్షచంద్రునిమాడ్కి వృద్ధిబొందింపుచు అధిక సొంపు తో బెంచుచు బహుప్రియమున గాపాడుచు విద్యలం గఱపించుచు నీతు లుదెలిపించుచు సత్యములుమొలిపించుచువచ్చుచుండెను. ఇట్లుండ జయ

ప్రదాదేవి కన్యపర్వంబగు వయసుమీరి యవ్వనప్రాయమున చేరెనని తనభార్యచెప్ప విని రాజతిశీఘ్రమున కన్యకాపురంబొందు సిద్ధయించి అందు దాసీజనములును కోజసమూహములును నుగుడింపజేసి అతిఅంతరిత్యములు అందుగాపించి తనపుత్రికను అందునుంచియుండ, నాకన్యారత్నమగు జయప్రదాదేవి అతిఉత్సాహమున దాసీజనములతో ఆట్లాడుకొనుచు విచ్చలవిడిగా సంచరించుచుండ నొక్కనాడు తనసఖజనములతో పుద్యానవనమున పండువెన్నెలలందు వొందారులు ఆడియాడి గీతములుపాడిపాడి గంతులునోడికోడిశరీరములు డస్సలవాడి మగుడగూడి పొదరిండ్లజేరి నృతమువలమీరి సిడంగోరి సూనములజేర వాసనలపూరి శృంగారములమీరదేర వొక్కచో కూర్చొని యుండగు మాటలుమాట్లాడుచున్నంతనొకదాసీ చమత్కారవల్లి యగు నత్తామవల్లి అల్లి కగొని తల్లియాని నిలచి యీభూమండలమున యేబదియారుదేశముల కధిపతియగురాజులో అతిచమత్కారపరాక్రమసంపన్నవంతులు అందుప్రతిష్టానపురమునేలుచక్రవర్తియగు పురూరవచక్రవర్తికిగలయోగ్యత మరెవరికైనం గలదా లేనేలేదు, అదెట్లనగా, రూపమున మన్మధుండై తేజమునసూర్యుండై బలమున హిమవంతుండై స్థిరమున మేరువై శాంతమునసముద్రుడై ఐశ్వర్యమున కుబేరుడై దానమున అతిదాతయై అలంకారమున విష్ణువై కోపమునశంకరుండై ప్రత్సాహసాహస ధైర్యబుద్ధి శక్తిపరాక్రమములు అవలంబించి తనకేదియు సమానములేక శుద్ధబ్రహ్మస్వరూపుడై వెలుగుచున్నాడు. అతనికిసమానమగు చక్రవర్తులయాభూలోకమున లేరని చెప్పినవిని జయప్రదాదేవి అతిసంతోషించి దాసికి లిగి మనముప్పతిల్లి కించుకపిక్కటిలి సొంపుమిడితరి మదపొర్లి పురూరవచక్రవర్తిని వివాహముగావింప సన్నికగొని యిష్టకామ్యములుదీర్చుకొనుట కాతండే ఆధారమని అతడే భర్తగావలయునని యిష్టదైవమునను మనసా పూజలు చేయుచు సదాప్రార్థించుచు కేశగళ్ళువర్ణించుచు మదనోద్రేకమున దేహమువాడి సూక్ష్మమైనచిక్కిండినగాత్రముతో కన్యామతమున నూనియైయుండెను.

ఇట్లుండ నొకనాడు దాదులంనొక్కతె మాసిగా యున్నజయప్రదనుగని అమ్మా రమ్మా నెమ్మనమునంగల మర్మను లేమిసీవైసాక్షికం

తమునిక్కి యెన్నికలోదక్కి మిక్కిలిచిక్కియుండుటగాంచి మేమతి బతిమాలియు మాటపలుకక యుండుటగాని భయముపొంది రాజుగారికిన్ని రాజ్ఞికిన్ని దెలుపుటేయుత్తమమని వేగమునజని ఓరాజాధిరాజా రాజమార్తాండమహారాజా తమపుత్రి యగు జయప్రదాదేవి మాదాసీజనములతో గూడి యిన్నిదినములు సుఖమున ఆడుచుపాడుచు నెమ్మదిగ యుండి యిప్పుడు మౌనంబవలంబించి యెవ్వరితో మాటలాడక అన్నము జెందక యేమియుదోచక తానేచప్పరించుక నొక్కింతయైనమాయిపోక ఖిన్నురాలై యున్నయదియని పలికినవచనములువిని రాజుగారిగుండె చెదరి తనపత్నియగు జనకజవల్లికిదెలియచేసిన ఆబిడ్డ అతివేగమున కన్యాసుతము ప్రవేశించి ముద్దులుబెట్టి యొయమ్మాయని పిలచి కృశించియున్న కూతుంగాంచి సూచకములు గుర్తెరిగి మన్మథావస్థదగిలి యిట్లున్నదనిదెలిసి తనభర్త చెంతజేరి కొమార్తెకుగలకష్టమును దెలిపించి శీఘ్రమున వివాహము ప్రయత్నించుమని మందలించిన వచనములవిని సభాస్థానముచేరి మంత్రింబిలిచి యేబదియారు దేశాధిపతులు వచ్చిచేరునట్లు స్వయంవరము సాటించుమనెను. అంత నామంత్రివర్యుండు స్వయంవరము నిశ్చయించి విశాలనగరపాలితుండగు సోమదత్తమహారాజు కొమార్తెయగు జయప్రదాదేవి కుసుమధామంబొందినకరములతో కొలువుమంటపముజేరి తానువరించినవారికి పుష్పదామము మెడ వేసి పాణిగ్రహణముచేసికొనగోరుచున్నయదిగాపున రాజాధిరాజులగు రాజసార్వభౌములగు తాము తమయిష్టజనకుటుంబసమేతముగ విజయముచేయవలయునని ప్రార్థనాపూర్వకముగా పత్రికలు వ్రాయించి అంతసోమదత్తమహారాజు తమ ముద్రికనుబెట్టి దేశములకుచాటింప ఆయాదేశపురాజులున్ను తమయిష్టజనములును రథగజతురగపదాదులను చతురంగబలముతో సన్నాహ మురళీనాదములతో భూరికాహళ ఘోషములతో భేరీమృదంగాది ధ్వనులతో ధణాధణాధణయనుఝణత్కారములతో ఫళఫళఫళయనురథావేగముతో ధిమిధిమిధిమి యను అశ్వగతితో భంభంమను జయజయధ్వనులతో వచ్చిచేరిరి. అట్లే పురూరవచక్రవర్తి తనపరివారములతో సింహనాదముమీర పరాక్రమము నలుదిక్కులుపారధర్మనీతులు దగ్గరరారమ్మని వీరశూరత్వమింపార శుభముచేకూర ఖ్యాతి

భువిమీఁదవచ్చి నొకచోటందిగియుండి మరునాఁడుదయమున రాజాధిరాజులందరు తమతమ అనుష్ఠానములు దీర్చుకొని యిష్టమృష్టాన్నములంది సుగంధపరిమళములంది ఆభరణములు బూంది ధనుర్బాణముల జెంది పురూరవచక్రవర్తి మొదలుగాఁగల రాజశ్రేష్ఠులందరు స్వయంవర మంటపమునకు విజయముచేసిరి. అంత సోమదత్తమహారాజు తనకొమార్తెయగు జయప్రదాదేవిని దాదులవెంబడి రప్పించి గౌరవించి స్వయంవరమంటపమున నిలిపి తమపుత్రికా నీమనసునఁగల సందేహములు యీసభయందుగల రాజశేఖరుల ముందుబలికి వారికి సమాధానములంది నీమనసు నెమ్మదిగొనుమనఁగనంతలో జయప్రదాదేవి దోడబుట్టగు సుమతీంద్రమహారాజు లేచి యేఁబదియారు దేశాధిపతులనుజూచి ఆనందముమించి ఓరాజశిఖామణులారా మహాధాతలారా మహానుభావులారా పరాక్రమశాలులారా అతిధీరులారా నేనిపుడు నొకప్రశ్న అడుగఁబూనెదను. అందుకు బదులుత్తరమిచ్చువారెవరో వారికి నాసహోదరియగు జయప్రదాదేవి నామము వైచి పాణిగ్రహణ మహోత్సవము గావించుకొనుననిబలికిన పలుకులువిన్న సభవారందరు అట్టిబలుకుమన నాతండతిపుత్సాహమున ధైర్యముగొని ఓసహో రాజసార్వభౌములారా వినుండు జెప్పెదను. ఈప్రపంచము లోపల శ్రేష్ఠత్వము పొందియు మహానుభావులను ఖ్యాతి వహించిన తలిదండ్రుల మంత్రభేదములచేత మొగది ఆడదిగాను ఆడది మొగదిగా జనించినభేదములు వొండొకటి భేదముమాని వంశవృద్ధి జేసి గొప్పఖ్యాతియు శీలమునువహించిన ఆమొగదే ఆడదై గర్భమునసుద్భవించి దినక్రమమున వృద్ధిజెంది సత్యశౌచ ధర్మశీలత్వములును సకలశాస్త్రాగమపరిశీలతయు గోబ్రాహ్మణదేవాలయ పత్తనముల రక్షణార్థియు మహాపరాక్రమశుద్ధ వీరావీరభుజబల ప్రతాపశాలియు సకల దిగ్విజయశాలియునే మండలాధిపతియై పడుచేగావలనని తపముబూని రాజ్యాధికారముసలుపుచు సకలరాజులకున్ను చక్రవర్తియైఅతివీరులకువీరుండై యుండు శూరుండెవడో అట్టిపరాక్రమముగల చక్రవర్తికి నాసహోదరిహస్తములు బట్టుమని జెప్పిన విని రాజులందరు మూఁగలువలెఖిన్నులై శిరముల నేలవంచుకొనుచు మారుపలుకక యున్నారు. అంత పురూరవచక్రవర్తి సకలరాజశ్రేష్ఠులను గాంచి ధైర్యమెగయ గంభీర్యమున తనవంశపూర్వవృ

త్తాంతములనెల్ల ఆయత్తముగ చితము నొత్తుకొని వృత్తములకుముందు అందరికి దెలియునట్లు తనసచ్చరిత్రమును నీతియును సత్యశౌచములను గౌరవములను వసిష్ఠాదిగురుజన అనుగ్రహమును హరిహరాది దైవకృపాతిశయములను సూర్యచంద్ర వంశానుక్రమప్రకారంబును తనతలిదండ్రుల పారంపర్యము తనలోగల అభిప్రాయములును సవిస్తారముగా విస్తరించినంత వినుచున్న రాజులందరుఅతిశయించియుండుతఱి జయప్రదాదేవి కుసుమదామమువైచిన హస్తములతో మందగమనయై రాజులెల్ల ఆశ్చర్యమునమునుగునట్లుతటాలున వెళ్ళి మండలాధిపతియగు పురూరవచక్రవర్తిసమీపము జేరి తనచేతయున్నకుసుమమాలికను వారిమెడలోవైచెనప్పుడు అంతరిక్షమున దేవతలు పుష్పవర్షములు గురియ భేరీకాహళమృదంగాదివాద్యము లెగయ చిత్రసేనసమేతమున రంభాది మేనకలు నాట్యములుసలుప కిన్నరాదిపురుషులుపాడ గాంధర్వాదియక్షులు కైవారములుచెప్ప యింద్రాదులు ఆనందింప నారదాదిమునులు ఆశీర్వచనము అక్షతలు తలంబ్రాలుబోయ ఆదిశేషుడు మొదలుగాగల దేవాదిదేవతలు నెక్కుటేవాక్కున పురూరవచక్రవర్తే జయప్రదాదేవికిభర్తయని చంద్రసూర్య అరుంధతిని సాక్షిభూతమిడి మంగళాశాసనంబులుజేసి సరిదంపతులని వారికివారే తగుదురని అతియాహ్లాదము చెంది దీర్ఘాయువులని బ్రహ్మను యెన్నికగొని తమతమనివాసములంజని సుఖంబుండిరి.

అదిమొదలు జయప్రదాదేవి తన భర్తకు పూడిగములుచేయుట మిక్కుటమగుపూజయని అతనికి యతిజాగ్రతగా సుపచర్యలు జేయుచు దైవముగా నెంచుచు భక్తివిశ్వాసముల నుంచుచు వారి మాటలను నిరీక్షించుచు అతని తిరువడితామరల నమస్కరించుచు యిదేకైవల్యమని స్థిరముగ నెంచుచు వారి తిరునామమే యీశ్వరమంత్రమని పఠించుచు సదాకాలము విరక్తిలేనిచిత్తవృత్తిగలిగి భయభక్తివిశ్వాసముల దేలుచుండెను. ఇట్లుండ భార్యయందు పురూరవచక్రవర్తి అతిప్రియుండై సంతుష్టిగలిగియుండ శనిమాయచే ధనకనకవస్తువాహన భూనగరములనువిడచి తనభార్య బిడ్డలుగూడ అర్ధరాత్రమున తన్నగరమువిడిచి విపినముజేరి నారాత్రంతయు నడచి సూర్యోదయమున తమసమూహమున పుష్పవాటికిగల నొకకొలనుగాంచి రేయంతయునడిచిన శ్రమ నివా

రణమునకై అచోటవిశ్రమించి కొంతసేపటికి లేచి అతటాకమున స్నానము జేసి శివపూజలం దీర్చి తనభార్యాబిడ్డలంగాంచి పీరికష్టమును నేనుజూచునట్లు నానుసట వ్రాసియున్నాఁడో శివశివాయని పంచాక్షరీమంత్రమును ధ్యానించుచు లేచి అతిచింతాక్రాంతుండై చెరియొకబిడ్డను యెత్తుకొని అచ్చోటగల అతిశయములను బిడ్డలకును భార్యలకును జూపుచు వాటి వివరముల జెప్పుచు గమనశ్రమ దెలియనీయక ఉత్సాహపరచుచు నచ్చునప్పుడు మొుకభూములను దాటి వరభూములుగాంచి అందుధాన్యము బారిగాయుండుటనుగని మనము జీవించుటకు తగుప్రదేశంబనితలంచి పోవుచున్నప్పుడు మధ్యాహ్నసమయమున సద్దియొగపు ఘటికలు గడిచినందున యెన్నఁడు నడువనేరనివారు గనుక శ్రేయంతియు నడచినకష్టముగనుక సూర్యదీప్తిన్యాము గనుక నిద్రలేనివారు గనుక ఆకలిగొన్నవారుగనుక బడలికవారుగనుక నడువశక్తిలేక నోటమాటరాక కండ్లుచీకటిపోక వాళ్ళు గడగడవణుక మార్గమునందే మూర్ఛజెంది నేలంబడిరి. అంత యిరువురు శిశువులు తినుగోండు గలిగి నేడుస్కోరకు మని యేడ్చుచుండ పోరుగునపోవుచున్న వరిశోత్తరాండ్రలో పెద్దవాడగు ఆనందుడనువాడు ఈఘోరములనువిని యిదేమి ఆశ్చర్యము మార్గమొకటియుండ నురియొకదారిని కని శిశువులు అరచుచున్నవి అదేమో తెలియ చేసుపోయిచూచిరండని తనపనివాండ్రకు ఉత్తరవిచ్చెను. అందు కొకడు వేగిరమునపరుగెత్తి వారింగాంచి ఆకలిచేతను దప్పిచేతను అయాసపడి గమనశ్రమముచేతను మూర్ఛిల్లినారని చెప్పిన విని ఆనందుడు మొదలుగాగల వారలకు గొనివచ్చిన అన్నమును యెత్తుకపోయి వారలకునిచ్చి దప్పితీర్చి నెమ్మదిపరచి మీరెవ్వరని వారి కుశలవార్తల నడుగ తలబెట్టెను.

ఓపుణ్యపురుషా దివ్యాంగవేషా నిన్నుజూచి నామనసతిచంచలము జెందుచున్నది. నీవెవ్వడవు నీవూరేది యెందుండి నచ్చుచున్నావు ఇప్పుడెందేగెదవు జెప్పుమని అతివినయంబున నడిగిన ఆనందునిచూచి రాజచక్రవర్తి మాన్యుఖుండై హీనస్వరమున యిట్లని చెప్పందొడంగె. ఓ అయ్యా నేను పురూరవ చక్రవర్తి కొలువున లెక్కవ్రాసెడి గణికుండను నారాజు రాజ్యంబువోడి దిశలుతప్పినుగాని యెందైనను జీవిం

చవచ్చునని యూరువెడలి యిట్లువచ్చితిని. నాకొడుకు యీశ్వరుడు నిర్ణ
యించి యున్నాడో తెలియ లేదని చింతాసముద్రమున మునిగి దీని
వార్తలాడగనిన ఆనందుడు వోయయ్యా మేమందరము కూలివాండ్ల
ము మాకుగలవాటిలో కించిత్తు తమకు సహాయము చేయగల వారము
గాన్పున మాకువలయు లెక్కలువ్రాసి మాచెంతన జీవించి యుండుమని
పలికిన పలుకులువిని రాజు యతిసంతుష్టుండై ఆ ప్రకారమేచేయుడీ అట్లే
యుండెదనని వొప్పుకొనెను. అంత వారందరు యేకీభవించి నొకచీరెను
వస్త్రమును గొనివచ్చి యిరువురకు నిచ్చి నొకపంచకట్టించి అందువీరల
వాసమునకు యిల్లుచేసి అన్నవస్త్రములకు కొదవలేక యతి ప్రియంబున
కాపాడుచు వచ్చుచుండిరి. ఇట్లుండ ఆనందుడు మొదలుగాగల కూలివా
రందరున్ను తమయందు ప్రియముగా యుండుటనుబట్టి తన భార్యతో
ముందలించుచు ఈశ్వరుని నిర్ణయంబని నిశ్చయించి తన భార్యకు ధర్మా
ర్థకామమోక్షములను జ్ఞానవైరాగ్యంబులను దెలుపుచు ఈశ్వరధ్యా
నము చేయుచుండెను. పతివ్రతయగు జయప్రదాదేవి తనపతివల్లగలిగిన
కష్టంబులను దారిద్ర్యములను గమనించక పతియేదైవమని యెంచినత
లంపుమారక మిక్కిలి ప్రియముగలదై యెక్కువ పరిచర్యలుచేయుచు
చిక్కులు మాన్పుకొనుచు ధ్యానించుచు పతికి భయపడుచు మునుపుకన్న
యెక్కువగా స్నానాదులు చేయుచు సత్యశౌచములమీరుచు పతిపాద
ములొత్తుచు శిశువులను గాపాడుచు భర్తనుగాంచి సంతోషించుచు
అన్యచిత్తముల మరచుచు పతియందే మనము నిలుపుచు వారికి సంతో
షముగలుగునట్లు అతిప్రియముతో నడుచుకొనుచుండెను.

ఇట్లుండ సోమపురియను పట్టణమున ననకోటి నారాయణుడను
పేరువహించిన శెట్టియొకండు అతిసంపన్నవంతుడై యుండెను. అట్టివాని
ఐశ్వర్యము దినక్రమముగ తరుగుచువచ్చుచుండెను. అందుచే వాడతిచిం
తాక్రాంతుడై పండితులరావించి తనకుగల అవస్థలను వారితో జెప్పి అందు
కు తగుపాటి చికిత్స తెలియని ప్రార్థించెను. పండితులు ధర్మశాస్త్ర
ములను పరిశీలించి వోవైశ్యమూడవకులపట్టి ఐశ్వర్యపెట్టి ఖ్యాతిగల
జగజెట్టి శాస్త్రముల జెప్పియుండునట్లు తాము ముప్పదిరెండుధర్మముల
నుక్రమముగా జేసినగాని మీభండారమున కొరతలేని ఐశ్వర్యము చేరుచుగ

పును. మొన్నను తక్కువగా నేరదని చెప్పినవిని శెట్టిగారు ఆమేరకే అన్న ధర్మములు సరిపరిగా జేసి దివ్యమగు తటాకమొండు నియమించుటకై ఆపట్టణమునగల కూలివాండ్రకందరికి పెద్దవాడగు ఆనందుడనువాని రప్పించి ఓరీ ఆనందా ఈచోట నొక గొప్పకొలను త్రవ్వవలయునని దిట్టము జేసెను. అంతట ఆనందుడు మొదలుగాగల కూలివాండ్రందరుగూడి కొలను త్రవ్వనారంభించిరి. ఇట్లు ప్రతిదినము ఉదయాది మొదలు సంధ్యవరకు కూలిచేసి శెట్టిగారివద్ద వారివారికూలిని పుచ్చుకొనునప్పుడు ఆనందుడు శెట్టిగారినిజూచి ఓస్వామీ ధర్మచింతామణీ పుణ్యకార్యధురీణ దీనపోషకశిఖామణీ తాము మాకందరికి ఐశ్వర్యమిచ్చి సుఖముగా పాలించుట కుద్యుక్తులైతిరి. అట్లే కర్షకమునకు నొకపాలు రోజున్ను యిచ్చి రక్షించవలయునని ప్రార్థించినందుకగిన నా శెట్టి యందుకు వొప్పి కర్షకుని ఒక భాగము ప్రతిరోజున్ను యిచ్చుచుండెను. ఇట్లుకొన్నిదినములు జరుగుచుండ నొకనాడు శెట్టిగారు కూలివాండ్రనుజూచి మీరికమీద కూలి తీయుటకు రావనిలేదు. మీయింటయుండు ఆడవాండ్రను పంపుడీ వారిచేతికిచ్చి పంపెదనని ఆజ్ఞాపించెను. అట్లువారు సాయంసమయమున రూకకై తమ ఆడవాండ్రను పంపుచుండిరి. ఆ శెట్టిగారు ఆయాడవాండ్ర చేతికి భత్యము లిచ్చుచుండెను. ఇట్లిచ్చుచున్న శెట్టిగారికి ధర్మచింతనగల చిత్తము మాసశనిమహాత్మ్యమున దుర్మార్గమైన బుద్ధిబూని విపరీతముచేకొని ఆ ఆడవాండ్రనుగని మీ కర్షకుని భార్య యెవరనియడిగిన వారు యిదిగో నిలుచున్న ఈబిడ్డ నతని భార్యయని జెప్పిరంత శెట్టిగారు నాబిడ్డలను జూచి సంతోషించి నాపతివ్రతయొక్క యోగ్యతను గుర్తెరుగక పరులభార్య తల్లియనిదలవక శని మహాత్మ్యమువలన మూసిగిన శెట్టిగారు నాపుణ్యవతినిజూచి అతి ఆహ్లాదముతో ఆహా ఇంతటియింతి భూలోకమునందుగలదే ఇది మనుష్యశరీరమేనా ఇట్లు ఇంతటిరూపముగలిగి యున్నదాయనితలంచి కురులంగాంచి జోహారు తుమ్మెదల దొంతియగు నీలాద్రియో నిష్కళంక పరిపూర్ణమగు అర్ధచంద్రుడో లేకయిదినుదురో సర్వలోకమోహితుండగు నవమన్మథుని చేతి ధనుస్సో లేక యిదినొసలో తటాకముసబట్టి మహిమము చేతడస్సి హిమధాముని కిరణములచే కొన్నారునీలోత్పలములో లేక కండ్లో ఆనందమొందించుతిలపుష్పమో లేక నాసికయో నిమ్నోన్నతమగు హేమపల

కమో లేక యిదికపోలమో దీపాంతరమున అపరూపముగ మొలచెడు పగడమో ఇదిఅధరమో యిదేటిగళమో శాంతకుంభపు రోజాపువ్వమో అమరితకలశమో పూబంతియోయని పలువిధముల తనలో తాను వితర్కించుచు చెలువమీరి నలువ తెలివిగొని ఈపొలతిని సృజించిన విధ మెట్లో రంభాదిదేవతలు దీనికిసమముగు దురాకారుకారు వారు లేరు లేరు దీనిగన్న తలిదండ్రు లెంత పుణ్యవంతులో వాండ్ల భాగ్యమే భాగ్యము. ఐనను వారు యింతటి రూపలావణ్యవతియోవతియగు యింతిని దరిద్రుడగు కర్ణికునికిచ్చి వివాహముగావించినారే వారికిబుద్ధిహీనతముగాబోలు. ఈచిన్నది అదృష్టమున తగిలి దారిద్ర్యము అనుభవించుచున్నది. ఇట్టియింతి మనవశమున నుండెనేని దీనిదారిద్ర్యముతొలగి అతి సుఖమున నుండునని తలంచి దానితో నొకమాటమాట్లాడి జూచెదము. అందుకు లోబడకుంటే ఆవల యెట్లయోచించి అందుకు తగుయుపాయము వెదకెదమని యుండెను. అంత ప్రతిరోజున్ను కూలివాండ్ర భార్యలువచ్చి రోజుభత్యము తీసుకపోవుక్రమమున నాటిదినము ఈపతివ్రతయగు జయప్రదాదేవి పోనందుచే శెట్టిగారు కూలి ఆడవాండ్రనుగాంచి మీకర్ణికుని భార్యయేది యెందుకు కూలికిరాలేదని యడుగగా వారు యేమో రాలేదని చెప్పి వారివారిబత్యఖర్చునుదీసుకొని కర్ణికునియింటికి వచ్చి మేమందరము బత్యముదీసుకొని వెళ్లుచున్నాము నీవు పోయి నీభత్యము తీసుకపొమ్మని చెప్పి వారివారి యిండ్లకేగిరి.

అంత శెట్టిగారు తనకర్ణికునిబిలచి కూలిమాత్రము రెండవఅంకణములో కుమర్చిబెట్టుండని చెప్పి రహస్యముగా నొకమాట మందలించెను. అదేమనగా కర్ణికునిభార్యవచ్చి బత్యమడుగగా శెట్టిగారు రెండవఅంకణమున నీకూలిబెట్టియున్నారు నీవుపోయి యెత్తుకొమ్మని చెప్పి అదిలోనికిరాగానే కవాటమునుబిగించి వేయుండని రహస్యముగ జెప్పి శెట్టిగారు వెళ్లిరి. ఇచ్చట యిట్లుండ చక్రవర్తి తనభార్యనుగాంచి వోసఖి కూలివాండ్ల భార్యలందరు శెట్టిగారిచే నివ్వబడిన బత్యములను వాడినింపుకొని తమతమ యిండ్లకేగుచున్నారు గావున నీవు త్వరలోచని మనకు రావలయు బత్యములను రాబట్టుకొని వేగిరమ్మని సెలవిచ్చిన సఖిరత్నము భర్తమాటను జవదాటని శుచిమతి గనుక ఆజ్ఞచొప్పున శెట్టిగారి వాకిటనిలచి అచ్చోట

యున్న పరివారములనుజూచి మాకూలి యిప్పించండన వారు శెట్టిగారు రెండవలంకణమున మీబత్త్యమును పంచియున్నారు లోపలచని తమబత్త్యమును నెత్తుకపోండని చెప్పిన నాబిడ్డ కొంతసేపు చింతించి హాహా పుణ్యపురుషా మునుగ్మగాపాడెడి తండ్రీ ఆదరించు దైవమా నాకొసంగు బత్త్యము అంకణములోనుంచక బైటయుంచితే యెత్తుకపోలేనా లోపల యేల యుంచిపోవలెను కొంతసేపు యోచించి మార్గానచనిన భర్త యేమనికోపించునో ఆకలిచే బిడ్డ లెట్లుతపింతురో యని పతిమాటలకట్టుబడిన పతివ్రతయగు జయప్రద లోపలచని ఆ కణముదాటి రెండవకట్టడమున ప్రవేశించి బత్త్యములగు ధాన్యము లెందనుచ్చియున్నదో యనిచూచుచున్నంత శెట్టిగారిభృత్యులు లోగాలున కవాటమును బిగించివెళ్ళిరి. తలుపు శబ్దమువిన్న నాయువతిరత్నము గుండెలదుర శరీరము గడగడవణంకదిగులొంది పతివ్రతముపొంది శౌచము జెంది విస్మయమంది హరిహరి ప్రాణనాథా రావా నన్నుగాన నా నాపాలిటలేవాయని పలువిధముల చింతించుచు నాయంకణమున నెవరులేక యుండుటనుగాంచి యంకాయొకగదిలో ప్రవేశించి కవాటములబిగించుకొని ఖాలిగాయున్న నొకపెద్దపెట్టెయను వీక్షించి యిదేమిమోసము మనలు మంచిపనమున లోపలబొమ్మని తలుపులకు తాళముబెట్టిరే మన ఖర్మమేమని చెప్పవచ్చునుయివన్నియు శనిమహాత్మ్యమున వచ్చెడు చేటుగాని మరొండుగాదని తలంచినాపెట్టెయను దెరచి పతిపాదములనుదలచి నాపెట్టెయలో దిగి ఆహా దైవమా నాయందు యింత పక్షమా సుతుల గాపుడధర్మమా పతినెడబాయుట న్యాయమా యింత చరమా నీకిది అసూయతనమా ఎసంగొదవకాదు. కలిమాయచే కలవెన్ని చేసినను వ్రతభంగము కానీయకజేసి జయప్రద పతివ్రతయను ధ్వజము గాపాడి రక్షించుముస్వామీ యిదిగో ఈపెట్టెలో దిగియున్నాను. ఇప్పుడు ఈపెట్టెయలో నేనుండువరకుఆకలిలేకను దప్పిలేకను అగ్నిచేగాలకను నీరిచేదడువకను మృగములచే బాగలకను ఆయుధములచే భేదించకను క్రిములచే శిథిలములుగాకను శాశ్వతముగానుండిన భర్తవచ్చి తెరుచునందాక ఈపెట్టెయ యెవరిచేదెరువశక్తిలేక నుండవలెనని తనపాతివ్రత్యమును ముందిడి ప్రమాణమునుమ్మాగు బెట్టి పెట్టెపైమూతను మూసుకొనెనని జెప్పినమాత్రమున నాజయప్రదాదేవి శౌచవ్రతములకు భయముజెందినధర్మ

దేవతయగు సరస్వతీదేవి ముందునిలచి నాబిడ్డపలుకులకు లోబడి అల్లెబిగి యబట్టుకొని జీవామృతమాత్రమును ఆపెట్టెయందే చల్లి మూతబిగించి ఈబిడ్డపత్నిచేమాత్రము దెరువశక్యమగునట్లుయని సత్యముగాని చనెను. ఆవల నవకోటినారాయణశెట్టిగారు అతిత్రాసమునవచ్చి తనపరిజనములమెచ్చి సంతోషమునను నిలిపి వారి రండుడీయని పిలచి అంకణవాకిలి తెరచి చేడియ నువలచి అతివేగిరమునడచి లోపలప్రవేశించి అందమునె తెలిగానక శెట్టిగారు ఆశ్చర్యమంది సేవకులజూచి ఆగదిలోగల పెట్టెయలోనుండునేమో చూడుడీయని తెరువ నుద్యుక్తులై తెరువలేక ఇదేమివింత తాళములేని ఈపెట్టె బిగించుటకు యేమికారణమూ తెలియలేదని యోచించుచున్న సేవకులజూచి సెట్టిగారు కోపించి వారి ఈపెట్టెను తెరువనియక యేదో యుక్తులుపన్ని బిగియపట్టుకొనియున్నది గావున గొడ్డండ్రచేబగులగొట్టుండన వారుచెరియొక గొడ్డలెత్తుకొనివాని పెకిత్తి కొంటకొట్టిరిగాని నూగింజప్రమాణమైనను నాపెట్టియపగలకపోయెను. అంత సెట్టిగారుమనసున కొంత దిగులుగలిగి కూలివాండ్రకర్షకులువచ్చి అడిగితే మనమేమిచెప్పవచ్చునని తపించుచు నాపెట్టను బైటకుతీసుకరండని బైటదెచ్చించిచూడగా నాపెట్టియపై గొడ్డలిచేకొట్టినగాయం బేమాత్రముకనబడకుండినయిదేమో విచిత్రముగయున్నది శీఘ్రముగ మీరు ఈపెట్టెను ఆగదిలోయుంచి అగ్నిబెట్టితగలబెట్టుండని యాజ్ఞాపించి కూలివాండ్రుగాని యెవరైననువచ్చిఅడిగితేని ఈగదిలో కర్షకుని కూలియుంచియుంటిమి. అందుప్రవేశించి ఆచిన్నది బత్యము నెత్తుకపోయెను. అప్పుడు ఆగది తగలబడినది మాకుం దెలియదు యిప్పుడు నీళ్లచే తడుపవచ్చితిమి యని చెప్పుడు భద్రము భద్రమని ఆజ్ఞచేసినిలుచుండెను. అంతలో ఆగది భగ్గునమండి ప్రక్కన మరొకగదియు కాలి బొగ్గులై నేలతోనేల సమమయ్యెనేగాని నాపెట్టెమునుపటియట్లు చిరంజీవితమైయుండెను. అధిక భయముతో శెట్టిగారు కాళ్లుచేతులు గడగడవణక నోట తడిలేక ధారలుధారలుగా చెమటలుగార కండ్లుచీకటులు గ్రమ్మమనసున దిగులుసొమ్మ వొళ్లుదెలియక తడతడ వొడలుసోల చేతులు నలుపుకొనుచు యిక యేమిచేయబోవుచున్నాను కిండ్లలో యెవరైనావచ్చి అడిగితే నేనేమిచెప్పబోవుచున్నాను. ఈపెట్టెయలో యీబిడ్డవుండునది నిజమే మనయందు నేరము వాటిల్లునది నిజమే. మనము చేయుకార్యముల

ధర్మమే యిదెల్ల అన్యాయమేయని దెలిసి ఉప్పూరిరాజు మనల నేమిచే
యునో యెంతటిఆజ్ఞ నిచ్చునో యేమివిధించునో యిదేమి మనమూరకుం
డక యిల్లుతగలబెట్టుకొని ద్రవ్యముపోగొట్టుకొని శరీరము కష్టపడుకొని
మనస్సున చింతలునింపుకొని బాసపెసగాంద్రను వేడుకొని ఇట్టిఅవస్థపడు
టకంటె ఈ పెట్టెను తీసుకపోయి పెద్దరాతిబండ యొకటికట్టి నడిసముద్ర
మున పారవైచుటే న్యాయమునిదలంచి పెట్టియనుయెత్తించుకొని అంద
మానుద్వీపములకు చనెను ఓడను దీసుకపోయి యోడపై ఎక్కించి
దానుంగూర్చుండి ఓడపోవుసమయమున కొంతదూరమునకనిఈపెట్టియ
ను నీళ్ళలో ద్రోయుటకు ప్రయత్నించెను. అప్పుడు పెట్టెలోనున్న జయ
ప్రదాదేవి కొంతతడవుయోజించి మనలను ఈసముద్రమునపారవైచితే
మనమేమిచేయుబోవుచున్నాము. మనభర్తకెట్లుదెలుసును కాబట్టి ఈపెట్టె
లో మాట్లాడి తప్పించుకొనవలెననిదలచి ఓసెట్టిగారు తాముజేసియున్న
ఆలోచనలతో నేమి ప్రయోజనము నిష్ప్రయోజనము అగుచే మీకే
మియు ఫలములేదు. ఇప్పుడు ఈపెట్టెను వేయుటకు నెనవిల్ల కాసెర
ను. ఈనీళ్ళ వేసినను నీళ్ళచే తడవకు చెదలగిలకు చెరులంటకు నేమియు
చెడుపురాదు నేనొకటిచెప్పెదవినుము నాకొకవ్రతముగలదు ఆవ్రతము
పూర్తియగుటకు పదున్నరసంవత్సరమున్నది ఆవెనుక ఈపెట్టె తనంతటదె
రుచుకొనను అంతవరకు ఈపెట్టెనుగాపాడుమని జెప్పినమాటనువిని
శెట్టిగారు ఓహో యిదేమి ఆశ్చర్యము పదున్నరసంవత్సరము అన్నపా
నాదులు లేక యేవిధమున జీవించియుండబోవుచున్నది. ఐనను చూతా
మని శెట్టిగారు అండమానుద్వీపములకు వెళ్లి అచట పెట్టెనుదించుకొని
నొక యంతఃపురమునకట్టించి అందులో యీపెట్టెనుంచి దానికి సమీప
మున తానన్ను అతిజాగరూకుడై కాచుకొనియుండెను.

ఇట్లుండ నచ్చోట చక్రవర్తికి యనేకములగు దుష్కారణములు
గలిగి కూలితేబోయిన తనభార్య రానందున బిడ్డలను చేతబట్టుకొని శెట్టి
గారి బజారముచేరి కూలివాండ్రనుచూచి ఓఅయ్యలారా! కూలికుంచ
ములకై వచ్చిన నాభార్యను గాంచితిరాయని అడిగిన, వారతిధైర్యమున
ఓరీ! నీభార్య కుంచములు గొనుటకు అగడిలో ప్రవేశించెను. ఆమాత్ర
మున గడికి అగ్గితగిలి భగ్గున మండిపోయెను. మాకింతే తెలుసునుగాని,

డున్న నారాజునకు శనిమాయ విడవక కష్టములు చాలక దయలేక తపింపజేయుచున్న సూర్యపుత్రుండు వానిమాయచే నాదేవపురీపాలకుం డగు దేవరాజు భార్య ధరించుకొన్న యాభరణముల బంగారుపెట్టెను యెత్తుకవచ్చి నాచక్రవర్తి నిద్రించుసమయమునం గని తలవైపున నునిచిపోయెను. అంత నగలశోధకులు వచ్చిచూచి ఈబంగారుపెట్టె ఈగొల్లవానికి డెట్లుగలిగెను. ఎవరో దొంగిలించుకొని వచ్చియున్నాడని దలంచి నా చక్రవర్తినికట్టి పట్టియుంచుకొని నాపురాధిపునియెదుట నిలుపగా వారుతనభార్య నగలపెట్టియయని దెలిసికొని తలవర్లరప్పించి వీనికాళ్లు చేతులు గోయుండని యాజ్ఞాపించెను. సేవకులు నాతనిదీసుకపోయి నాతని కాళ్లుచేతులు దీసివేసిరి. అంత నాచక్రవర్తి బాధలకోర్వలేక తపించుచు పొరలుచున్న సమయమున సరస్వతీదేవి గగనమున నేగుచున్నప్పుడు యీతనికంఠధ్వనివిని తటాలునవచ్చి దయహెచ్చి మచ్చికతో అచ్చోటవిచ్చేసి నాచక్రవర్తిని దెలిసికొని శనిమాయనుగని నాతనికి తగు పాటిమాటలచే హితంబులుచెప్పి నగుకుగాయములను మాయముగావాన్పి అప్పటన్పటికి అమృతపానమిచ్చి యేగుచుండెను.

ఇట్లుండ నాపురంబున కాపైయున్న దేశికశెట్టియనునొకడువిని నారాజును యెత్తుకొనిపోయి తనగృహంబునయుంచుకొని నతిగారాబమున కాపాడుచువచ్చుచుండెను. కొన్నిదినంబులకు ఉపరిష్టియనుమహర్షి అచ్చోటికేతెంచి నాచక్రవర్తిగారి క్షేమములను సవిస్తరంబుగావిని నతిచింతాక్రాంతుండై ఇక నీవు క్షేమమునుగలిగి ఆలుబిడ్డలసమేతముగా రాజ్యాభిషిక్తుండవుగాక యని ఆశీర్వచనంబుచెప్పి చెంగియనుగొల్లవానింటికేగి శిశువుల నిరుపురగాంచి వారినినూరార్చి విలువిద్యలు మొదలగు వాటినెల్ల గఱపి వారలను ప్రవీణులుగాజేసి అందమానవద్వీపమునకేగి అచ్చోట పట్టియ నునిచి కాపైయున్న శెట్టిగారినిగాంచి క్షేమములువిని పురూరవచక్రవర్తిగారికంగల దురవస్థలెల్లంజెప్పగా పట్టియందే యున్న జయప్రదాదేవి మనంబున దిగులొంది శరీరము గడగడవణక మైసోల చెమట గ్రాల కుట్టియందే తపించుచు హా దైవమా! ఇక నేనేమిచేయుదానను. నా ప్రాణము లెట్లుండబోవుచున్నది. నాభర్తను యెపుడుగాంచబోవుచున్నదాన నని దుఃఖించి కాళ్ళుచేతులుపోయినను గొదవగాదు. ప్రాణములు

మాత్రము గట్టిగాయుంటే చాలును. నాపతిని నేనాదరించుకొనెదనని తనలోతాను తీర్మానించుకొని సమయము యెదురుచూచుకొనియుండెను. అంత నామహర్షి శెట్టిగారినిచూచి నామొఱియగు చక్రవర్తియు వారిబిడ్డలు భార్యలు మొదలగువారందరు సుఖీభవించియుండుటకు సమయము శీఘ్రమునవాటిల్లును. వారు మునుపటియట్లు రాజ్యంబుబొంది సుఖంబనుభవింతురుగాక యని తన నివాసంబుకేగె. తరువాత దేవపురమున శెట్టియింటయున్న పురూరవచక్రవర్తియొకనాడు మంచి నిశీధసమయంబున పండువెన్నెలలో మేడయందు పరుపుపై పవళించి ఆనందము మించి మంచివీణచేవహించి పాడదొడంగెను. ఇట్లతిశృంగారముగ పాడునప్పుడు నాపురి రాజపుత్రికయగుపుష్పపాంచాలియను కన్యాశిరోమణి మేడపైనహించి నిదురరాక పొరలుచున్నసమయమున నాచక్రవర్తి పాడుచున్న గానములనువిని అతిఆశ్చర్యముంబొంది కొంతతడవు గానమునశ్రవణముపెట్టి మనసుపట్టలేక పుట్టినమోహమునఁ సఖులను తట్టిలేపి యిపుడుపాడుచున్న నాపుణ్యపురుషుండెవడు నతడేనాభర్త నతనినే పాణిగ్రహణము చేసుకొందునుగాని ఇతరులనొల్లను శీఘ్రమునపోయి చూచిరండని యంపిన వారేగినలుప్రక్కలుచూడగా శెట్టివారియింట వృచ్ఛరియందున్నవాడని తెలిసివచ్చి ఓయమ్మా మనయింట ఆభరణములుదొంగిలించి కాళ్ళుచేతులు దీయబడ్డమొండివాడని చెప్పె విని చాలాతడవు యోచించి ఇదేటివింత యింతగాయకునకు దొంగతనంబబ్బునాయుండదు అదేటికారణమో యెఱుగము. ఐనను కానవగాదు నాతఁడేనాభర్తయని నిశ్చయించుకొని మదనోద్రేకయై తహతహంబుల నొరయుచుండ సఖీజనములు రాజుగారివద్దజేరితమకొమార్తె కామోద్దీపితయై వివాహంబు గోరియున్నదని చెప్పినవినిరాజు నారాజులరావించి వుచితాసనములనియమించి పుత్రికకు మంగళస్నానములు గావించి సభాస్థలికి రప్పించి రాజులనుజూపించి పుష్పమాల చేతికందించి నీయభిప్రాయముగనుపించు మెడవైచిరమ్మా మాయమ్మా ముద్దులపట్టీ యనిగారాబముగుమాటల చెప్పి బంపె. అంతటనాబిడ్డ కోపంబుకొని తండ్రింగాంచిఓయయ్యా! ఈఅయ్యలను నేనుందే యెరుగుదును నాకో మునుపు గానంబునపాడినవారలు వీరేగాని అవశ్యములేదు నేను కోరియున్నగాయకుండే నాభర్తగాని

ఇతరులుగారు అట్టి మహానుభావుండు ఇచ్చోట యుండెనేని నాతనికి యీపుష్పదామము మెడవైచి పాణిగ్రహణము చేసుకొందును. ఇచ్చోట గానలేనే అగుపడలేనే అని తనయిష్టదైవమును దలంచి చేతనున్న దామమును గిరగిరం ద్రిప్పి ఆకాశమార్గమున ఎగవేసి శిరముపై చేతులు ముకుళించి దైవమును ప్రార్థించి వేండమనసు గావించి పండుగాన లెనని మొంచియున్న పుష్పహంచాలి యిష్టపతి రూపము నాకు సుమదామము గిరగిరం దిరిగి మూలకూర్చుకొని యున్న పురూరవ చక్రవర్తి కంఠంబున బడెను. అంత నాచిన్నది సమీపముచేరి నాకు నాభర్తయని భయభక్తి వినయములతో నమస్కరించుచు నిలుచున్న కొమార్తెంగాంచి తలిదండ్రులు చాలా దుఃఖితులై మొండివానికి భార్యవైతి దేయని యిట్టి కర్మమాయని విలపించెదు వారలను వసిష్టుండు గాంచి వారిని నూరార్చుచున్నంత పుష్పహంచాలి తలిదండ్రులకు మ్రొక్కి నేనాతనికి దక్కితి గాన నా తనుకు చిన్న మాటలు రాక మేమి యూరలేక మీగృహంబులు నీరాక మానంబుపోక కాటిలో మిన్నక సంచరించుచున్నామని జెప్పి తాను ధరించుకొనియున్న వస్త్రములను ఆభరణములను దీసి నాండ్రైన బెట్టి పాతచీర కొంచెట్టి ధరించుకొని తనభర్తను యెత్తుకొని అరణ్యముచేరి సరస్వతీదేవిని గని పూజించి ఆశీర్వచనంబులంది భర్తయే దైవమని దాని వారికిగల సేవచర్యలు జేయుచు పతివ్రతయై దినములు గడుపుచుండెను.

ఇట్లుండుటను గాంచిన సరస్వతీదేవి శిల్పులచే నొకనగిరి కట్టించి అందు వీరిని నివసింపజేసి సుఖంబుండుమనిచనియె నంత కొంతకాలమునకు శనీశ్వరుండు దయగలవాండై ఆహా! ఇంతటి కష్టంబులు వాటిల్లియు సత్యశౌచంబులు మానడాయని ఆశ్చర్యంబంది విముక్తుం జేయదలంచి కాకంబుపై నెక్కి నచ్చోటు నిక్షించి వచ్చుచుండ మున్కుంటి నక్కరతో ప్రక్కన పార్వతింగొని వృషభారూఢుడై రాగ కిలుముల చెలిని చంకబెట్టుకొని పులుగునెక్కి మిన్నుపై వచ్చెడు పెన్నుకును అచ్చోటజేరి నా చక్రవర్తికి ఆశీర్వచనంబులు కూరి విముక్తంబులు మీరి పుష్పంబులు వారివానిపై పూరిక చరణాదులతో రారమ్మని జేరి రాజ్యాభిషిక్తుం గాకమ్మనిగోరి వారివారి నివాసంబులకుం జనిరి. అంత నా చక్రవర్తికి మునుపటియట్లు మేలగు శృంగారంబును కాళ్ళుచేతు లలంకారంబును తమప్రకా

శంబును భుజబలపరాక్రమంబును మీరిమీరివచ్చెను. అదిగాంచి పుష్ప పాంచాలి మనస్సున నిలువనిసంతోషముగలిగి వికాసవదనయై తన తలిదండ్రులరావించి తన భర్తంజూపించిన వారుభయముజెంది అతిశౌర్యాండని దిగులొందిరి రూపయౌవనసంపన్నుండని మనసుసంసిగ్గొంది సంతోషమున వెలుగొందిరి ఆచోటనే నొకపట్టణంబుంగాంచి దైవికపురియని నామంబిడి నాతనికి దైవీకమహారాజని సవినయమున నామకరణముగావించి వారేగినంత నారాజు మనునీతిపారంగునిక రాజ్యభారము చేయుచున్నంత తన పూర్వమంత్రియగు మతిధీరుడు అనేకరాజ్యములు దిరిగి యెందుగానక తన చక్రవర్తి ఇందున్నాడని దెలిసి యెప్పటియట్లు వానింగలసి మెలగుచు రాజునకు మునుట్ల మంత్రిగాయుండెను. అంత గొల్లవాడయగు చెంగి తాను సాకుచున్న బాలురిరువురకు యుక్తమగువయసువచ్చెను. వీరలను యెచ్చోటనైన దగునుద్యోగంబునకు నిశ్చయించి దైవీకపురమున కొచ్చి తనపుత్రులను నౌకరులుగ యుంచుకొనుమని రాజును వేడుకొనగా నారట్లే యొప్పుకొని తన నగరిలో నాయిరువురు బాలురకును కొలువిచ్చి యుంచుకొనెను.

ఇట్లుండ ఆందమానుద్వీపమందు యున్న నవకోటినారాయణ శెట్టికి ఏవిధ ఉపాయములచేత తత్తరపడుచుండ నవీనముగ దైవవశముచే మాహాత్మ్యముగల దైవీకపురియనుపట్టణంబొకటుగలదు అందుగల రాజతినీతిమంతుండై దైవబలముగలిగి రోగులకును కరచరణహీనులను విముక్తులంజేసి వలయువరంబుల పూర్తిచేయుచుండెనని విన అతివేగంబున పెట్టియనెత్తుకొని దైవీకపురముచేరి పెట్టియను దెరుపించుకొని వచ్చెదనని దలంచి నాపురికి దెచ్చి రాజసన్నిధానమునయుంచి ఆపెట్టియలో యున్న చిన్నదాని రూపురేఖాతిశయములను వర్ణించి పెట్టియదెరువ శక్యము గాదని చెప్పగా రాజతివిస్మయంబంది ఉపాయంబులున్నయు దైవశక్యము లేకయున్న రాజుగారు మనసున సరస్వతీదేవిని ప్రార్థించి నిలుచున్నంత యాసరస్వతీదేవి ఆక్షణంబున రాజును వీక్షించి ఓక్షితిపతీ! సత్యశౌచశీలవ్రతయు పతివ్రతయు నగు నిరత్న జయాప్రదాదేవి మానంబుకొడిగట్టి ప్రాణములు బిగబట్టి యాపెట్టియలో మూటకొనియున్న యది దాని పాతివ్రత్యధర్మంబున నొరులచే దెరువనీక అగ్నిచే గాలక నీటిచే

చెడక క్రియా లేనంతటకే ఆయుధంబులచే జీలకయుండునట్టి శాపంబుగట్టి ప్రాణప్రదాతగు నీహస్తంబు ముట్టినమాత్రమున దెరునవలయునని చెప్పిన నానత్యవచనంబులా భిన్నంబులుగావు. కావున ఓ రాజా! నీహస్తంబుతో తాకితివేని పెట్టెదెరువబడి నీభార్యం గాంతువని జెప్పిన మాత్రంబున తత్కాలమున తెరువంబడి దేదీప్యమానమై వెలుపలం వెలుగొంది తన భర్తపాదములపైబడి నమస్కరించి నిలుచున్నంత సరస్వతీదేవి రాజుంగాంచి ఓ సార్వభౌమా! అగ్నికి సమానమైన శుచీవతి యగు జయప్రదాదేవిని సుఖంబున నుండుము. అల్లదిగో నీసమ్ముఖంబున కొలువైయున్న ఇరువురు బాలురు నీకు సుతులే వారిని అంగీకరించుకొనుమాయని ఆశీర్వచనంబులు జేసి అంతర్ధానమై చనెను. అంత రాజతిసంతుష్టాంతరంగుండై భార్యదోడ్కొని సుపుత్రులంజేరి మంత్రిసమేతుండై పుష్పమాంచాలని వెంటబెట్టుకొని ముకుపట్లకు తన రాజ్యమునుపొంది చిరకాలము రాజ్యభారము జేయుచు అలపిదేని సుఖంబంది విష్ణుసాయుజ్యంబుజెందెను. కావున యువతులు తమపతులను దైవముగాదలంచివారికెదురాడ్కనక ప్రచితంబులే జేయుచు హితంబులుబల్కుచు గౌరవములుజూపుచుయుండుట పతివ్రతలకు నూతనముని మెలగవలయు.

జయప్రదాదేవి ప్రభావము ముగిసెను.



శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# శ్రీ భక్తవిజయము.

## ౩. చంద్రమతిదేవి ప్రభావము.

పూర్వకాలంబున అయోధ్యాపురంబును పాలించుచుండిన హరిశ్చంద్రుడని సూర్యవంశపు రాజొక్కడుగలడు. అతడు ధర్మరాజ్యపరిపా

లకుండును, సత్యభాషాధురంధరుఁడునై యుండుటవలన భగవంతుండు మెచ్చి తనసుదర్శనమును చక్రములు బంపగా నాచక్ర మతనిపాలనకు లోబడిన దేశంబులందంతయు సంచరించి దుష్టజనమర్దనంబును శిష్టపరిపాలనంబును సేయుచుండగా నారాజు అట్టివిచారము లేక రాజ్యమేలుచుండెను. అట్టిసత్యసంధుఁడగు హరిశ్చంద్రునకు చంద్రమతి యనునొక భార్య గలదు. ఆచంద్రమతికి లోహితాస్యుఁడను కుమారు డొకఁడుకలఁడు. అట్లుండగా స్వర్గలోకంబున నొక్కనాఁడు దేవేంద్రుఁడు సభఁగొలువుండి నారద వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులం బిలిపించి యర్ఘ్యపాద్యాది విధులం బూజించి యుచితాసనముల గూర్చుండబెట్టి యంతట లేచి కరకమలంబులు ముకుళించి మహాత్ములారా! భూలోకంబునం గలవారిలో నెవ్వరైనసత్యముదప్పనిపుణ్యాత్ములుగలరాయని యడిగెను. నడుగగా వసిష్ఠమహర్షి యంతట లేచి దేవా! అయోధ్యాపురంబున హరిశ్చంద్రుఁడను నొక సూర్యవంశపురాజు కలఁడని పలికె నంత విశ్వామిత్రమహర్షి లేచి హేదేవప్రభో! హరిశ్చంద్రుఁ డట్టివాఁడుకాఁడు. కేవలమతఁడు మనుష్యమాత్రుం డగుటవలన నబద్ధమాడకుండునే ఇదివట్టిమాట వాస్తవముగా నతఁడబద్ధమాడువాఁడేయని దృఢముగా నుత్తరంబొసంగె. నాక్షణంబున వసిష్ఠుండు కోపోద్దీపితమానసుండై లేచి ఓవిశ్వామిత్రా! ఏమిపలికితివి. ఔరా. హరిశ్చంద్రమహారాజు చక్రవర్తి మాయట్టివాఁడు. బాగుబాగు. నతఁడెంతమాత్రము నట్టివాఁడుకాఁడు. నతఁడు సత్యముదప్పక నీతిపరుఁడై రాజ్యమంత పరిపాలించుచుండు వాఁడగుటవలన నతనికి (సత్యభాషా హరిశ్చంద్రుఁడు) యను త్రిలోకప్రసిద్ధంబగు పేరుకలిగెనని చెప్పగా విశ్వామిత్రుం డంతట లేచి యోవసిష్ఠా! చూడుము. నేనెట్లైన వానిం బొంకించెద నట్లు బొంకింపకపోదునేని నేనీశ్వరుసంగూర్చి ఘోరతపంబు గావించిన యాతపఃఫలము నాతనికిచ్చి పదునాలుగు మన్వంతరములవఱకాతని దేవేంద్రపీఠంబునం గూర్చుండబెట్టి స్వర్గలోకం బేలింతునని పంతమాడె. అంతట వసిష్ఠుండు లేచి నీవట్టిహరిశ్చంద్రునినోట నబద్ధమాడించితివేని తత్క్షణంబున నా జెంజములద్రెంచి పారవైచి తల బోడిజేయించుకొని దేహమంతయు బొగ్గు పూసికొని గాడిదపై గూర్చుండి లోకులందరు ఛీఛీయనునట్లు దక్షిణాభిముఖుండై పోయెదనని ప్రతిజ్ఞ పెట్టి తమతమ నెలవులకుం బోయిరి. అంత

విశ్వామిత్రుండు కొన్నిదినంబులకు నొకానొక యాగంబు చేయం బూనిన వానివలె తంత్రముబన్ని హరిశ్చంద్రుం డున్నయెడకుం బోయి దీవించి యతనిచే సత్కారంబువడసి యోరాజా! నీవు సత్యసంధుండనియు ధర్మాత్ముఁడనియు నిన్నుఁ జూడవచ్చితి. నీవలన నాకొకసహాయము కావలసివచ్చితి యదేమనగా నే విశ్వేశ్వరార్పణముగా నొకయాగంబుగావింపదలంచితి నట్టియాగార్థమై మానవుండేనుగుపై నెక్కి యొకరత్నంబు వైచిన యంతటిధనమున విసరివేయ నంతపొడవుపోవునో యంతద్రవ్యము నాకిచ్చితివేని నయ్యాగంబు నెరవేర్చుదునని పల్కె.

అంత నాహరిశ్చంద్రుండు దేవా! మీవంటిమహాత్ములడిగిన దానంబిచ్చి కృతార్థుండనగుటకంటె మఱియొక పుణ్యముగలదే. మీవంటిమహానీయుల దర్శనమాత్రంబున బవిత్రుండనైతి. జన్మసఫలంబయ్యె. మీ యభిమతార్థంబుస నట్టియిత్తునని మహోత్సాహంబునం బల్కె. అప్పుడు విశ్వామిత్రుండు రాజా! నీవంటిదాతలు మాబోటి జడదారులను గలుగుట మాతపఃఫలంబు. ఇప్పుడు నాకట్టి ద్రవ్యంబుతో నక్కఱలేదు. పనిపడినప్పుడు కొనిపోయెదనని నానినీడ్చి తన యాశ్రమంబునకుం బోయె. పోయి తనశిష్యులలో బాల్యుండును, మాఱుస్వభావుండును, గపటాత్ముండునైన నక్షత్రకునిం బిల్చి శిష్యా! ఈక్షణంబున నీవు హరిశ్చంద్రమహారాజగు చక్రవర్తియొద్దకుం జని నీకు యాగనిమిత్తమై నాకిచ్చెదనన్నద్రవ్యము నేనడిగి తెమ్మనినట్లు నతనికిం జెప్పి ద్రవ్యముం గొనితెమ్మని పంపె. అంత నాశిష్యుం డట్లే రాజున్నయెడకుంబోయి యాగార్థమిచ్చెదనన్న ద్రవ్యముం గొని తెచ్చుటకై తన్ను నియమించినట్లు ఎఱింగింప నతండు సంతోషహృదయుండై ఈక్షణంబున బొక్కసంబున నున్న ద్రవ్యంబును దెప్పించి విశ్వామిత్రుం డడిగినద్రవ్యముకంటె పొడవగుకుప్పంబోసి దేవా! ఇదేగైకొనుడనిపల్కె. పల్కఁగ నారా హరిశ్చంద్రా! మంచివాడవు. యాగద్రవ్యము మాకిచ్చెదనన్న ధనమునకు వడ్డియాయె మూలధనంబిచ్చెదవేని గైకొందు. లేనిచో నియ్యలేనని చెప్పుము నేనరిగి యతనికి విన్నవించెద నని చెప్పగా, మరల తనయధీనంబగు వస్తువాహనాభరణాదిసంపదల నమ్మి తొల్లిటికంటె నిబ్బడిగానిచ్చె ఇవ్వగా నదియు వడ్డీకి డయ్యెనని పలికె.

అంత నమ్మహారాజు రాజ్యంబువిడిచి ధర్మపత్నియగు చంద్రమతీదేవిం దోడ్కొని పుత్రుండగు లోహితాస్యునితో నక్షత్రునితో కాశీపట్టణంబునకుంజని విశాలాక్షీసహితుండగు విశ్వనాథునిం దర్శించి యాదేవుని సన్నిధానంబున చంద్రమతీ దేవిని నిలిపి యెల్లవారు వినునట్లు గొప్పకంఠధ్వనితో వినుడో జనులారా! ఈ యిలవియుంపుకాంతనా ప్రాణకాంత. దీనిం జంద్రమతియందురు. విశ్వామిత్రమహర్షికి నేనిచ్చెదనన్న యాగార్థంబు కొఱనవడిగెను. అందువలన నీ తొయ్యలినమ్మెద. నట్టిద్రవ్యమిచ్చి దీనిం గొనువార లెవ్వరయిన నుండురేని వచ్చి కొనుండో పుణ్యశీలులారా యని పలుమారు బల్కసాగె. నట్లు బలుకుచుండ నా పట్టణంబున ననేకదినములుగ మిక్కిలి ముసలితనముచే గనుల గానక చెవులు వినబడక కిందుమీదుబడుచు కాసుతడబడిన నడకతో నుండు కాలకౌశికుండను బ్రాహ్మణుండు ఈవార్త వినియట్టిట్టో టికివచ్చి చిన్ననాటనుండి పీనుగలమోసి ధూర్తానంబులంగొని తిరిపెములెత్తి అక్కడక్కడ కడుపుకూళ్లుగుడిచి బ్రాహ్మణార్థంబని పిలచినమాత్రంబున నిదురమనసి పేరంబులెత్తుచు లోకులకెల్ల పెచ్చమునిచ్చుచు తప్పుపత్రంబులంబుట్టించుచు కల్లసాక్ష్యంబులాడుచు సంపాదించినద్రవ్యములంతయు మేరుపర్వతముకంటె మిక్కిలిపొడవుగ నెవ్వరికిం దెలియనిచోటందాచి ఇల్లిల్లును అంగడియంగడిని తిరిగి భిక్షమెత్తినధాన్యము మొదలగుపదార్థంబుల ముడిచికొన్నముల్లె వీపున వ్రేలాడగా పొగాకుతోడంగూడిన తమ్ములము ధారధారలుగా జొల్లుకారి గొంతెమీదంబడుచుండగా మిక్కిలిమలినంబును దుర్గంధము నొలయ యెల్లవారలు నతని ముకులనిచ్చుచు జందెంబును బెత్తికి పాఅవైచుచు చింపిపుట్టంబునీడ్చి పట్టాపంచెలుగా బాఅవైచుచు నపహాసింపుచుండగా యెటుచూచిన తుద మొదలు లేని చిక్కుకలం గట్టినట్లుతో లిన్నలిన్నగా హరిశ్చంద్రుని సమీపంబునకువచ్చి యోరాజా! నీవడిగినంతద్రవ్యము నేనిచ్చెదను. ఈచంద్రమతిని నాకిమ్మని నడిగెను నటుగగా యతం డాశ్చర్యపడి యౌరా, ధర్మవ్ను దేశస్థులగు రాజాధిరాజులే కొనలేనివారై యూరకుండగా (ఈబడుగు బాపడెక్కడ విశ్వామిత్రునిధనమెక్కడ) ఇంతయు సలివాడయ్యును కలుచవింగొని యెడలెరుంగక యున్నత్తుండై ఇట్లుపలుకుచు

న్నాఁడని యెంచి ఛీ ఛీ చింపికోకఁ గట్టిన బాపఁడా తెలియక ప్రేలెదవు త్రో రంబునఁ బొమ్ము. నక్కయెక్కడ నాగలోకమెక్కడ యని మాటాడుచుండగా నక్షత్రకుండు కనులు నిప్పులురాలగా కోపావేశంబున నా హరిశ్చంద్రుం గని యోరీ యెవ్వఁడైననేమి మాకిచ్చెదనన్న ద్రవ్యము పరిపూర్తిగ నెవ్వఁడిచ్చునో యట్టివానికి నమ్మవలసినవాఁడవే కావున నిప్పుడతనికిచ్చి ద్రవ్యంబుఁగొనియెదవా లేక నన్నుఁబొమ్మనెదవా యని పౌరుషంబుగఁ బలుకగా నాహరిశ్చంద్రుండు దైవచిత్తంబెట్లో నేనెరుంగనని డోలాయమానమానసుండై యాబ్రాహ్మణాభిప్రాయంబున కొడంబడి యతనిచే ద్రవ్యంబుఁగొని నక్షత్రకునికిచ్చి చంద్రమతీదేవిని నతనిపాలుచేసెను.

అంత నక్షత్రకుండు ద్రవ్యమును మావడ్డికి సరిదూఁగెనని పలికి కల్కునంత నా పట్టణంబున నున్న ప్రేతభూమికధీశుండగు వీరబాహునకు దన్నమ్ముకొని యా కొఱఁతవడిన ద్రవ్యంబును పరిసమాప్తి నొందించి యట్టి నక్షత్రకునికిచ్చి యతని వెడలనంపె. నిట్లుండగా నచ్చట చంద్రమతీదేవి కాలకౌశికవిప్రునొద్ద నతనియింటికిఁ జని సేవకవృత్తితో నా బ్రాహ్మణపత్నియగు కలహకంఠి చెప్పినపనులం జేయుచు దన పతివ్రతాగుణమువలనఁ గుమారుండగు లోహితాస్యునితో నాకలిదప్పులు లేనివారై యాహా పుణ్యవశంబున బ్రాహ్మణోపచారంబు గలిగెగదా యని యానందించునట్టి భార్యాభర్తలును నొక్కశయ్యనుండగా వారిపాదంబులం బిసుకుచు నెట్టియధమకార్యంబులం జెప్పిన నాపనులం జేయుచుఁ బ్రొద్దుపుచ్చుచుండెను. అట్లుండగా నొకనాఁ డాయమకుమారుండగు లోహితాస్యుండు ఆయూరి బ్రాహ్మణబాలురతోఁ గూడి సంధ్యాకాలంబున నడవికిం బోయి సమిత్కుశఫలాదులం గోయుచుండగా నొకపాము కఱచి వాఁడు మృతుఁడయ్యె నంత విప్రబాలురవలన చంద్రమతీదేవి యావృత్తాంతంబు విని హా పుత్రా! దైవము నీకిట్టి మరణంబుఁ బొందించెనా యని శోకంబున మూర్ఛిల్లి తత్క్షణంబున తెలివినొంది యావధూవరులం గని మ్రొక్కి పుణ్యాత్ములారా సార్వభౌమపుత్రుఁడగు లోహితాస్యుండు విప్రబాలకులతోడ వనంబునకుం జనియె. నచట సర్పదష్టుండై మృతినొందెనని వింటి. మీయనుగ్రహమున సెలవిచ్చితిరేని నిముసమాత్రంబున నచటికిం బోయిజూచి మరలివచ్చెదనని ప్రార్థింపగ, వారు ఓసి తొత్తా! యూరకనైన గుమారుండు

వచ్చెనని నీలియేడ్పు నేడ్చుచు వగలు జేసెదవు. ఛీమాయదారీ ఇట్టిబొం
కులుబొంకి తిన్నగా బాగిపోజూచెదవేమో, నిమిషంబైన నిన్ను వదలము.
అట్లుపోదలచితి వేని ఇంట్లోగలపనులన్నియుదీర్చి మముపవ్వళించి నిదురిం
చుసమయంబునబోయి మేల్కొనునంతలో రమ్ము అని సెలవిచ్చిరి. అట్లు
సెలవివ్వగానే చంద్రమతి తనుతెల్లంగదీర్చి వారునిద్రించుచుండు వేళ నర్ధరా
త్రంబున కటికచీకటిలో నయ్యడవికింజని పుత్రుంగని శోకంబునంబొగిలి
హాపుత్రా! నన్నువిడిచిపోతివేయని ప్రలాపించుచు నాకళేబరంబు నెత్తు
కొని రుద్రభూమికిం జని నొక్కచోటబెట్టి హాపుత్రా పుత్రాయను శోకవా
ర్తారవంబుల ప్రేతభూమిగలద్రిమ్మరి యచ్చటచ్చట గాలుచున్న ప్రేతం
బుల చితులలోనుండి కొఱకొఱకాష్ఠముల బోగుచేసి యట్టికాష్ఠంబుల
పై పుత్రునిందహింప బుద్ధిపట్టక చేతులిట్టటులల్లాడుచు యెట్టకేలకు
నిప్పుబెట్టు నవసరంబున నట్టిప్రేతభూమిగాంచుచుండు వీరబాహుండు
ఆశోకవార్తారవంబువిని లేచి లేడిపైనురుకు శార్దూలంబువలె గుప్పించి
దాకి యబలా ఈయర్ధరాత్రంబున కటికచీకటిలో భూతప్రేత పిశాచఢా
కినీ మొదలగు గ్రహంబులచేనతిభయంకరంబగు నీశ్మశానంబున కొంచె
మైన భయములేక సాహసంబునవచ్చితివి. నీప్రాణనాథుండెవ్వడు. యీ
శవంబెక్కడిది. ఇచ్చటనాయొడయుండగు వీరబాహు సేవకుండనై యుం
డువాడ. హరిశ్చంద్రుండను పేరొకన్నవాడ. నాయనుమతిలేక యీప్రే
తభూమియందుహరిహరాదులైనం జొరనొల్లరు.

అట్లుండగా యామహాసతి యెంతయు హాసిపి. ఛీ యీకళేబరంబు నెత్తుకొ
నిబొమ్ము. మానిర్ణయప్రకారము శవమొక్కటికి మాడప్రకారము మె
వ్వరైన నీయకుండినేని యట్టివారింజేర్చనొల్లము కావున, నొక్క మాడ
నిచ్చితివేని ఈడబెట్టిగాల్పను లేనియెడల బొమ్మని యాకళేబరమును
కాళ్లందొలంగద్రోయునెడ నాచంద్రమతి హాపుణ్యాత్మకా! చతుస్స
ముద్రవేలావలయితంబగు భూమండలము నేకచ్ఛత్రముగ పరిపాలించు
హరిశ్చంద్రుని కులకాంతను. నాపేరు చంద్రమతి. యీబాలుండు నా
పుత్రుండు. విశ్వామిత్రమహర్షి యాగనిమిత్తము యిచ్చెదనన్న ద్రవ్య
ముకొఱకై కాలకౌశికుండను బ్రాహ్మణునకు నన్నమ్మగానే నావిప్రు
నింట దాసీవృత్తివి చెప్పినపనులం జేయుచుండుదు. ఈపుత్రుండు సంధ్యా

వ్రేటు వేసె వేయు నది యాపతివ్రతయొక్క పాతివ్రత్యమహిమవలన నొక
పుష్పమాలికయై వెలసె. మఱల వాఁడిమిగల యాకత్తిని బిరబిరం ద్రిప్పి
రెండవమారు నొక వ్రేటు వేయఁబోవు నవసరమున విశ్వామిత్రుం డడ్డపడి యు
తని చేతనున్న కత్తిం బట్టుకొని హాహా హరిశ్చంద్రా చాలుచాలు నీమగతనము
సూర్యవంశమున బుట్టిన రాజులయొక్క చేతులా యివి. స్త్రీలఁజంపుటయు
శూరత్వమేనా. స్త్రీవధ పంచమహాపాతకములలో నొక్కటియని నెఱుం
గవే. ఇప్పటికైనను నామాటవినుము. జగన్మోహనవిగ్రహములంబోలి చక్క
దనముగల నాపుత్రికారత్నముల నీకిచ్చి వివాహము చేయించెద మెప్ప
టివలెనె సమస్తవిభవములతో నీరాజ్యము నీచే నేలించెద. నామాటవిని
నిలుపుమనగానే విశ్వామిత్రా ఖడ్గము విడిచి మాట్లాడుము. మహానీయుల
గు ఋషులకట్టి కాలమున మాతోడం బనియేల స్వామీ మాకొడయుండ
గు వీరదాసునాజ్ఞ జవదాటనడచుట మహారౌరవనరకమండ్రు. నాకు మీ
కూతుండ్రుబని లేదు. గీతాంద్రుంబని వేదు. పొండుపొండని పల్కి నంత
విశ్వామిత్రుండు దనయత్నమేమియు నెఱవేరకుండుటవలన ఖడ్గమును వదలి
నిశ్చేష్టితుండై నిలిచె. అంతట హరిశ్చంద్రుండు ఔరా ఇదేమి చిత్రము,
మొదట వేసినవ్రేటు సతీకంఠమున పుష్పహారమైనిలచె. రెండవమారు
తలద్రుంపఁబోవుసమయమున విశ్వామిత్రుం డడ్డగించె. ఇటుల రెండవప
ర్యాయమును నిష్ఫలమగుట కారణం బేమెఱుంగ. నాపూర్వజన్మపాప
మో లేక సత్యమేమైనం దప్పితినో లేక సధర్మకార్యము లేమైనం జేసితి
నో లేక హరిశ్చంద్రుండగానో ఈయువతి చంద్రమతియు కాదో లేక ఇదేమై
న గలమోయని మిక్కిలి విగాతమునొంగి ధయిర్యమవలంబించి హేవిశ్వ
నాథా ఈమాటు వేసినవ్రేటుతోడ నీపద్మముఖి శిరచ్ఛేదంబైనగావల
యు నొండె నేనె ననిఖడ్గమున శిరచ్ఛేదము గావించుకొని చచ్చుటకొం
డె యని తెగువబూని ఖడ్గమును విసరివేయంబోవుసమయమున నీచం
ద్రమతి పాతివ్రత్యప్రభావమునకు మెచ్చి శ్రీవిశాలాక్షీసహితుండగు
విశ్వనాథుండు వృషభవాహనారూఢుండై హరిశ్చంద్రునిముందు నిలచి
హరిశ్చంద్రా నిలుపు నిలుపుము. ఈ చంద్రమతీదేవిపాతివ్రత్యమహిమకు
ను నీసత్యమహిమకును నేమెచ్చితి ననియవ్వధూవరుల నంటినమాత్ర
మున వారలు తొల్లిటివలె దివ్యదేహులై వెలసిరి. తత్క్షణమున వృ

తుండైన లోహితాస్యుని బ్రతికించి యనేక వరముల నిచ్చి యంతర్ధాన మైచనిరి.

అంత విశ్వామిత్రుండా హరిశ్చంద్రుంగాంచి యోపుణ్యాత్మకా నీవు నిత్యవ్రతుండగుదో కాదో, యనునోనిశ్చయము దెలియంగగోరి నిన్ను పలుబాధలం బెట్టితి. నీవే సత్యభాషాహరిశ్చంద్రుండవు. ఈ మాటసత్య ముసత్యము. నేనజ్ఞానకృత్యమున నిన్నింత గాసిపెట్టితిని. మహాపాపుడను క్రూరాత్ముండను గావున నాతప్పు క్షమించుమని వేడగానే మునీంద్రా నీవుమాకు జేసినయుపకారముపకారమయ్యె. నీయనుగ్రహమున నిర్గుణుండును నిరామయుండును పరంజ్యోతియు సచ్చిదానంద స్వరూపుండు నగు పరబ్రహ్మమును కన్నుల కరువు దీరం గంటి నింతకంటెభాగ్యం బెద్దియని నిర్మలహృదయుండై శాంతవచనముల నమ్మునీంద్రుంగనుం గొని పలికి సాష్టాంగవందనం బాచరించిన యంత నమ్మునియు నతని లేవనెత్తి యనేకవిధములదీవించి తనతపోబలమునం దర్ధఫలం బతనికిచ్చి దేవేంద్రసింహాసనమునం దర్ధపీఠమునగూర్చుండ బెట్టి పదునాలుగుమన్వం తరములవఱకు నితనిచే స్వర్గలోకము నేలించి పిదప విశాలాక్షీసహిత శ్రీ విశ్వనాధ పాదారవిందములం దైక్యమగునట్లు చేసెనని చెప్పె. గావున యువతులు తమపతులను దైవముగా దలచి వారి కెదురాడక పుచితమును చేయుచు హితములు బల్కుచు జూపుచుయుండుటె పతి వ్రతలకు సూటియని యెఱుంగవలయును.

చంద్రమతీదేవి ప్రభావము ముగిసెను.





శ్రీరస్తు.

# శ్రీ భక్తవిజయము.



## ౪. దమయంతిదేవి ప్రభావము.

నిషధ దేశము నేలు వీరసేనమహారాజు కుమారుండగు నళమహారాజొక్కండుకలడు. అతడు విదర్భదేశాధీశుండగు భీమసేన మహారాజు కుమార్తెయగు దమయంతిని వివాహము చేసుకొనెను. ఆమె వివాహ కాలమునకు పూర్వము ఆమె చక్కదనమునకు ఇంద్ర, అగ్ని, యమ, వరుణులు మెచ్చి మోహపరవశులై దానిం దాము పెండ్లియాడవలయునను తలంపున నానళుండున్న మేడకువచ్చి వానింగనినళా! విదర్భదేశాధీశుండగు భీమసేనమహారాజపుత్రికిం బాణిగ్రహణంబని సకలదేశాధీశులకుం జాటింపగా విని మేము వచ్చితిమి. మానవులలో నీవంటి ధర్మ చింతాతత్పరుండును, నుపకారగుణముగలవాడును లేడు. గనుక నీవీక్షణమున నా దమయంతియున్న యెడకుంబోయి మాప్రభావముల వేర్వేఱ నెఱింగించి ఆ యింతి మమ్మేలాగుననైన వరియించునట్లు చేసితివేని నీకుం దొడ్డపుణ్యమగునని పల్కిరి.

అంత నళుండు దమయంతియున్న యంతఃపురమునకుం జని వారి ప్రభావములం జెప్పి వారి యభిప్రాయములనుం దెలుపగా నామె విని

యుండువారు మానవకన్యకల వరింపఁగోరుట ధర్మమా మీపాదారవిందములంగొల్చి కృతార్థత్వము సామాన్యులగు మాకొఁటి సఖ్యముచితంబె కావున నాయందు కరుణించి మీమీ నిజరూపములందాల్చి త్రిలోకపూజ్యుండగు నళునకు నన్ను బట్టపుదేవిం గావించి నన్నేలరేయుని సాష్టాంగనమస్కారం బాచరింపఁగా నా దేవులు దమయంతీదేవి సద్గుణములకును ధర్మమార్గమునకును మనోదృఢత్వమునకును మెచ్చి తమ తొంటి రూపములందాల్చి ప్రత్యక్షమైనిలిచిరి.

అంత నాదమయంతీదేవి నళమహారాజుం గాంచి లజ్జావరవశత్వమున తలవాంచి యల్లన సమీపించి మృదుపాణి సుమదామముంగొని యతని కంఠమునవైచె. నంత నాదిక్పాలురు వధూవరుల సద్గుణాతిశయములకు మెచ్చి వారల దీవించి తమతమనివాసములకుంబోయిరి. ఆవెనుక దమయంతీదేవి "నాన్యంభర్తృవినాదైవం స్త్రీణాంజన్మ సుజన్మసు" అను స్మృతివచనప్రకారము పతిని దైవసమానముగ భావించి త్రికరణశుద్ధిగా నతని పూజింపుచు సర్వకర్మముల ఫలముంగోరక జేయుచు సర్వము బతికర్పణము గావించుచు శాంతశమదమాదిగుణముల కాటపట్టయి షోడశోపచారముల నతని మనస్సునకు సంతోషము బుట్టింపుచు అతడు తనతో ప్రియభాషణము లాడుసమయమున నతనింగని కరకమలములు ముకుళించి దేవా పరమాత్మలక్షణమును, జననమరణశోక మోహాత్యుత్పిపాసము లనియెడు వారికోశములందనిలి, సంసారసాగరమునంబడి మునుగుచు దేలుచు దరిజేరునుపాయంబెఱుంగక యరిషడ్వర్గములచే అహంకార మమకారములవలయు నీజీవునకు యెవ్విధమున విముక్తిమార్గమబ్బునో అట్టిలక్షణమును జెప్పవే యని ప్రార్థింపఁగా నతండిట్లనియె.

వినుమో ప్రాణనాయకీ! ఇతరమైన వస్తువుచే చూడఁగూడనిదియు వినఁజాలనిదియునై యేదియున్నదో అదియే పరబ్రహ్మము. అదియే పరమాత్మయునగు. అట్టి పరమాత్ముండానందస్వరూపుండు. అఖండబోధగలవాడు. చిత్ప్రకాశుండునై సర్వదేహములయందు క్షేత్రజ్ఞుండయి ప్రవర్తించును. మేఘము లేప్రకారమున నాకాశమునంటవో అట్లు ఆ మాక్షేత్రధర్మములయిన సంసారదుఃఖములు క్షేత్రజ్ఞుండగు పరమా

త్మునియుంటువు, నిశ్శేషముగా ప్రపంచమనెడి దుఃఖములు నశించుట వలన సర్వప్రపంచమును ఆనందరూపముగాను ప్రపంచమనియెడి అజ్ఞానమునశించుటవలన సర్వప్రపంచమును సత్యమగు బ్రహ్మముగాను తెలుసుకొనును మృత్తికవలనం గలిగెడు ఘటంబులన్నియు నెట్లు మృత్తికాస్వరూపంబులుగా నేయుండునో అట్లు బ్రహ్మమందు దోచెడు ప్రపంచంబంతయు బ్రహ్మస్వరూపమేయగును గనుక ఈ ప్రపంచంబంతయు అఖండంబగు పరమాత్మస్వరూపంబని యెఱుంగుము ప్రపంచవ్యవహారంబంతయు గలయోనియు, సర్వము బ్రహ్మమయంబనియు జ్ఞానులగు వారు మనోనిశ్చయము జేసి విముక్తిబొందుదురు. జననము, మరణము, గమనము, ఆగమనము, పుణ్యపాపములు, దుఃఖములు మొదలగునవి యన్నియు పరమార్థంబున లేవు ఈసర్వంబును బ్రహ్మవేత్తలగు బ్రహ్మస్వరూపముగానే తోచును, మఱియును జన్మ మృత్యు సుఖదుఃఖంబులు లేనిదియు, జాతినీతికులగోత్రంబులు లేనిదియు, చిత్తుయందు నివర్తనావరూపమున వర్తించెడి యీ జగమునకు కారణమగు యే పరమపదము కలదో అదియే పరమాత్మ, ఇక జీవన్ముక్తి లక్షణం బెఱింగింతు వినుము సకలజన్మంబులందును ధర్మార్థాచరణకారణంబైన మానవజన్మంబతి దుర్లభము అదియును శతవర్ష పరిమితంబైన జీవితకాలంబు నియుతంబైయుండు అందు సగము అంధకారబంధురంబై రాత్రికాలంబున నిద్రాది వ్యవహారంబులచేత నిరర్థకంబై, కడకు చిక్కిన యేబదిసంవత్సరమునందు బాల్య యౌవన కౌమార కైశోర వయోవిశేషంబులచేత వింశతిహాయనంబులుగడచు, కడమ ముప్పదియబ్దంబులునింద్రియంబుల చేతబట్టువడి దురవగాహంబైన కామ క్రోధ లోభ మోహ మదమాత్సరంబులను పాశంబులం గట్టువడి విడివడ సమర్థుండు గానేరక ప్రాణంబులకంటె మధురాయమానంబై తృష్ణాలతలలోబడి భృత్యోతస్కరవణిక్క్షగ్రంథులం ప్రాణహానియైన నంగీకరించి పదార్థంబుల జేర్చుచు, రహస్యసంభోగచాతుర్య సౌందర్యాదిశేషంబుల ధైర్యవల్లికాబవిత్రంబులైన కళత్రంబులను మధురాలాపంబులుగలిగి నసులైన శిశువులను వినయ వివేక విద్యాలంకారులైన కుమారులను భ్రాతలను, జననీజనకులను బంధువులను ధనకనకవస్తువాహన సుందరంబులైన మందిరంబులును;

బంధులను, పశుభృత్యనికరంబులను వంశపరంపరాయత్తంబులయిన విత్తంబులను వర్జింపలేక, సంసారంబు నిర్జింప నుపాయంబు గానక తంతువర్గంబున నిర్గమద్వారశూన్యంబైన మందిరంబుజేరి చిక్కువడి వెడలిపోవనుపాయంబు దెలియక తగులుపడు పురుగుచందంబున గృహస్థుండు స్వయంకృతకర్మబద్ధుండై నిజకుటుంబపోషణంబుకొఱకై బుద్ధిపూర్వకంబుగ నధర్మార్జనంబుసేయుచు, నాయది నీయది యను భిన్నభావంబున నజ్ఞానాంధకారంబున బ్రవేశించు కావున కౌమారసమయమందుండియే జ్ఞానోపార్జనంబుసేయుచు నిష్కాములై సర్వకర్మంబులు పరమేశ్వరార్పణంబు సేయుచు సదా భగవన్నామ స్మరణసేయుచుండవలయు. దుఃఖంబులుకోరకయే యెట్లు సంప్రాప్తంబగునటుల సుఖంబులు కాలానుసారంబులై లబ్ధంబులగు. కావున వృథా ప్రయాసంబున నాయువును వ్యయము సేయందగదు సచ్చిదానందస్వరూపుండగు పరమాత్ముని ధ్యానంబున మోక్షము సిద్ధించు అట్టి పరబ్రహ్మము సర్వాంతర్యామి సర్వప్రాణులకు నాత్మేశ్వరుండు ముముక్షుండగు దేహికి దేహావసానపర్యంతము భగవన్నామస్మరణ సేయుచుండుటయే మోక్షమార్గమునకు హేతువనిం దెలిపె. అంత నా దమయంతి జీవాత్మకుం బరమాత్మకుంగల తారతమ్యంబు దెలిసి యో ప్రాణేశ్వరా! ఇట్టి మహత్వంబెఱింగించిన నీవే నాపాలిటిపరబ్రహ్మంబవు అని పల్కి సర్వకాలసర్వావస్థలయందును భర్తృపాదారవిందంబులం ద్రికరణశుద్ధిగా పూజింపుచుండె అట్లుండగా కొన్నాళ్ళకువెనుక శనేశ్వరుని మహిమవలన రాజ్యమును ధనకనకవస్తువాహనాది సంపత్తునుం బోగొట్టుకొని సతీపతులు నడపులపాలైచని పలుకష్టములంబడుచుండె యొకనాడు మిక్కిలి యాకలికోర్వలేక నా యరణ్యమున గొన్ని పక్షులు తమసమీపమున వ్రాలియుండగా నలుండా గువ్వలంబట్టి భక్షించి యాకలి దీర్చుకొందమని తనయొంటనున్న వస్త్రంబును విడదీసి పక్షులపై వేయగా నవి మాయాశకుంతంబులగుటవలన నా వుట్టంబుతోడ నంతరిక్షమున కెగిరిపోయెను అంతట నలుండు వస్త్రహీనుండై మిక్కిలి విచారములొందుచుండగా నాదమయంతీదేవి యాక్షణమున తనకోకనగ మువనిపైగప్పి యతనికి ధయిర్యము దెలుపుచుండె.

అట్లుండగా నొకనాడు నళుండా దమయంతీదేవిం జూచి యో మానినీ! కంటకపాషాణములచే నుండు నీ యరణ్యప్రదేశమున నాతోడ నీవు నడచిరానేరవు ముందు పోనుపోను దుష్టమృగములచే నతి భయంకరములగు మార్గములుండు మిక్కిలి పొడవగు పర్వతముల నెక్కి రానేరవు నదీప్రవాహములం గడచి రానేరవు కావున అబలా! నిన్నుఁగొనిపోయి నీ పుట్టింట విడిచివచ్చెద. నచ్చట సుఖముగ నుండుము. నాతోడ నిడుములఁబడఁజాలవని పల్కఁగా నాపుణ్యవతి హే ప్రాణనాథా! మంచిమాటంటివి పురుషులు నిష్టంబగునప్పుడు శ్రమ చెందునప్పుడు ఆకలి దప్పిగొన్నప్పుడును వారి దుఃఖమునుఁ బోగొట్టి ధయిర్యమిచ్చునది ప్రాణకాంతలై యుండగా కటకటా ప్రాణేశ్వరా! నిన్నొంటిగా నీయడవుల పాలుపుచ్చి నేనుమాత్రము సుఖమనుభవించుట ధర్మమా మన కష్టముడుగువరకు మనమిద్దరము వికర్భకుండజని యుందము రమ్మని ప్రార్థించె మానిని నట్లు ప్రార్థింపగా నళుండా యింతిం జూచి చతుస్సముద్రవేలావలయమైన యీ భూమండలమంతయు నేకచక్రముగా నేలి కలిమి హీనుండనైన నేనిప్పు డేవిధమున నట్టివారి చెంత మోముం బెట్టుకొని యుందు పూర్వజన్మసంచితమగు నీకష్టము ననుభవించుటయొండె లేక ప్రాణపరిత్యాగము చేయుటయొండె యనం బలికె. యంత నా దమయంతీదేవి కష్టములం గని సహింపలేక ఆ యామ నిద్రించుచుండగా తనపై గప్పుకొన్న కోక సగము జింపి తన మనమున దీని వంచించి యెఱుఁగక పారిపోవుదు నేని నిదురనుండి మేల్కాని నన్నుం గానని కతమున దుఃఖించుచు తిన్నతిన్నగా పుట్టింటికిఁబోయి చేరి సుఖమున నుండునని నిశ్చయించి యానగము పుట్టముతోడ నా దమయంతీదేవిని విడచి పారిపోయెను.

అంత దమయంతీదేవి నిదురనుండి లేచి ప్రాణేశ్వరుం గానక దుఃఖించుచు హా దైవమా! యని యయ్యరణ్యమున గ్రుమ్మరుచుండగా విషానలము గ్రక్కుచు నతి భయంకరాకారమగు నొక పెనుబాము యాదేవిం బట్టి మ్రింగుచుండె నట్టి తరుణమున నొక్క యెఱుకువాఁ డడ్డపడి పాముం ద్రుంచి యాదేవిం గాపాడె. అట్లు కాపాడి యామెం జూచి భామా! యిట్టి భయంకరమగు యడవిప్రదేశమున నొంటరివై యేలయిట్లు

శ్రమపడుచుం జనియెదవు యిచ్చటనుండు వారలకెల్ల సేనధిపుండను. ధనకనకవస్తువాహనాదుల నొక్కటెంగొరతలేదని విభవములనుండువాడను. నన్ను పతిగా జేకొని నాతోడగమ్మని హితముగ మోహపరవశుడై పలికె. పలుకగా నన్నా, నేననాధను నీకుం జెలియలిసమానురాలను. నన్ను బాహునోటినుండి రక్షించితివి నీకుమేలుగాక. ఇట్టి పలుకాకుట నీ కధర్మము పోపొమ్మని తిరస్కారమున నా మొగముంగని బలికె. నంత వాడు కామపరవశుండై యాదేవిని బలాత్కారమున నంటబోవు నవసరమున నామె భర్తృపదారవిందములం దలంచి తన పాతివ్రత్యమహిమం జేసి వానిశపించినమాత్రమున వాడు భస్మీభూతుండై నశించెను. అంతట నచటనుండి కొందరువర్తకుల సహాయమున సుబాహుపురమునకు బోయిచేరి యారాజమాతయగు సునందాదేవి చెంత సైరంధ్రీవేషమునసుండి యాసునందం జూచి తల్లీ నేనుచ్ఛిష్టములంగుడువ, కట్టుపుట్టమునువిప్ప, ఎప్పుడు నిరాహారనై శరీరసుఖాలంకారములనుగోరక నీవు చెప్పినపనుల జేయుచు భర్తృపదారవింద ధ్యానముసేయుచు కాలక్షేపముసేయుదాన. నీకభిమతమేని యింటనుందు. కాదేని యెటకైనం బోదునని పల్కె నంతనారాజమాత దమయంతిని గని తల్లీనీమోముజూచినమాత్రాన అష్టయిశ్వర్యములకు నాధారమగు శోభనరేఖ తాండవింపుచున్నది. నీవు నాయొడనున్న జాలునని పల్కగా నాదేవి యచ్చట తన పాతివ్రత్య మహిమవలన నన్యాహారములు వర్జించి కొన్నాళ్ళచటనుండె అంతట తన పుట్టింటనుండి సుదేవుండను బ్రాహ్మణుండొక్కరుండు కొందరు విప్రులతోడ స్వస్తిపుణ్యాహవచనమునకై వచ్చినసెపమున నాదేవి నన్వేషించుటకై యారాజమందిరమున ప్రవేశించి దమయంతింగాంచి యాక్షణమున నచటనుండితరలి విదర్భకుం జని భీమసేనునకు దమయంతీ వర్తమాన మెఱింగించె. నంత నాభీమసేనుండు సుబాహుపురమునకుండి దమయంతి నాత్మగృహమునకు దోడ్కొని చనియె

అట్లుండగా కొన్నిదినములకు వెనుక పర్ణాదుడను బ్రాహ్మణుని వలన నలమహారాజు అయోధ్యాపురమును పాలించుచుండు ఋతుపర్ణునియెడ అశ్వశిక్షకుండును వంటలవాడునై మరుగుజ్జువేషమునం

గొలుచుచుండుటయెఱిగి భీమసేనమహారాజు పిమ్మట దమయంతీదేవికి ద్వితీయస్వయంవరమని నానాదేశపు రాజులకుం జాటించితిమి. నీకుఁజాటింపుమని భీమసేనుఁడానతిచ్చెనని ఋతుపర్ణున కెఱుఁగఁజేయుమనితిమేని యిచ్చటికి ఋతుపర్ణుండు వచ్చు. వానితో నళుండునువచ్చునని తన మనమునను ద్దేశించి సుదేవుండను భూసురునివలన స్వయంవరమునుం జాటింపె. ఋతుపర్ణమహారాజును వచ్చె. వానితో నళుండును వచ్చె. దమయంతీదేవి నళుండు వచ్చియుండుట వాగులచే యెఱింగి తత్క్షణమున కేశినియను దాసినొక్క దెంబిలిచి నళుండున్నజాడ నెఱింగి రమ్మని పంపె. పంపఁగా నది నళుండున్న చోటికిం బోయి యతనిం గాంచి యతఁడువంట జేయు లక్షణము నెఱింగి మరలివచ్చి దమయంతిం గాంచి, అమ్మా, నళమహారాజును కనులపండువుగ జూచితి. బాహుకుండను నామమున అతఁడు వంటజేయు నేర్పు నేమందును. ఆహా! నిమిషమాత్రమున భోజన పదార్థములనెల్ల నాయత్తపఱచె. ఇతఁడు కేవల మానుష్యమాత్రుఁడే. అతఁడే నిషధియగు నళుండు. సందేహములేదని పల్కె. అంత నా దమయంతి తనపుత్రులను దాసిచేనిచ్చి పిలింగొనిపోయి నళునకుఁజూపుమనె ననఁగా నదియును అట్లు బిడ్డలంగొని నళునకుం జెంతకుంజని యో బాహుకా, నీ వెవ్వఁడవు? నీ వాసస్థలమెయ్యది? తెలుపుమని యడిగె. నట్లడుగఁగా నతం డీబిడ్డల నెత్తుకొని ముద్దాడి తనమనమునను న్న పెక్కుతలంపులు పరులకు వినవచ్చునట్లు తలచి తలచి యేడ్చి మూర్ఛాక్రాంతుండై వెంటనే మూర్ఛందెలిసి ఆబిడ్డల దాసిచేనిచ్చి యికం గనిచ్చుటనుండఁదగదు. నాతీ వారలీయెడకు రానగదు. క్షణమాత్రమున గదలిపొమ్మని త్వరించసాగె. నప్పుడా కేశిని యతనిఁగని బాహుకా, యీబిడ్డల నెత్తుకొని దుఃఖించినమాత్రమున నాకుం జాలిపుట్టె. కత యేమని యడుగఁగా నతం డోతల్లీ, నేను పూర్వము మంచిస్థితిలోనుండి శనిమహాత్మ్యమున ఆలిని బిడ్డలనువిడిచి వారొకత్రోవయు నేనొకత్రోవయునై ఋతుపర్ణమహారాజు చెంత నిట్లు సేవకుండనై యుందు. నాబిడ్డలును యీబిడ్డలువలెనుండుటంబట్టి వీరి నెత్తుకొని దుఃఖించితి ననిం బల్కె. అంత నా కేశిని దమయంతి యున్న యెడకుంబోయి ఈవర్తమానమంతయు సవిస్తరముగాఁ దెలిపె. తెలుపఁగానే యతండే నా ప్రాణనాథుఁడు. అతండే నిషధపురము నేలు

నళుండు. నందియు నేమియు లేదని తన మనమున నిశ్చయించి యా దమయంతీదేవి మరల నా కేశినిజూచి ప్రాణసఖీ, నానిమిత్తమై మాటో క్కమాటి మరల నివచటికింజని యతడు పచనంబొనర్చిన భోజనపదా ర్థములు గొంత నడిగి తెమ్మనిబంప్ప నంపగా నది మరల యయ్యెడ కుంజని యట్టిపదార్థము లతని యడిగికొని తెచ్చె.

అంత దమయంతీదేవి వాటిచవింగని, ఇంక ననుమానింపనేల యని తలిదండ్రుల కవ్వర్తమానమంతయు తార్కాణముగా నెఱింగించి తండ్రి యనుమతిమున దనయొద్దకు బాహుకుని రావించి యతనింగని ఆహా! సూర్యవంశమునబుట్టిన రాజును నీతిపరులనియు, సత్యసంధులని యు, క్షత్రియధర్మ మేనురనివారనియు త్రిలోకములందు ప్రశస్తములై యుండు. కలివంశమున నెంతకష్టమొనగూడినను యిట్లు ఆలుబిడ్డల నెడబాసి భూతప్రేతపిశాచ శాకిని ఢాకినీ మొదలగు క్రూరగ్రహము లచే నతిభయంకరమగు యడవిప్రదేశమున యగ్నిసాక్షిగ గట్టుకొన్న పెండ్లామును నిదురింబుచ్చి యర్థరాత్రికాలమున గాఢముగ నిదుర పోవు సమయమెఱింగి దానిపైనున్న కోక సగముజించుకొని యనా థం జేసి పాఱిపోవువారుం గలరే అని కట్టలుకం బెక్కుతలంపులు తన మనమున నెట్టుకొన మిగుల వగలం జెలగు పలుకులంబలుకుచు కన్నీ రుమున్నీరుగా గార్చుచుండె.

అట్లుండు దమయంతింగని నళుండును తనమనముననున్నవిచార మునుదాప నలవిగాక తత్తరపాటున నాదమయంతింగని హా ప్రాణే శ్వరీ! యని పెక్కులగు తలంపుల కంఠముశోషింప నేడువదొడగె. అట్టి నళమహారాజుంగని దమయంతీదేవియు హాప్రాణేశ్వరా! యని యేడువ సాగె. అట్లుభయు లన్యోన్య వ్యసనాక్రాంతులై కొంతసేపటికి వ్యసన ముడిగించి పరస్పరము భావలోకములనుండి యంతనళుండాయింతింగని దమయంతీ! సతిపతులెట్టిబాములంబడినను ప్రాణనాథుడుండునట్టిసతికి పునస్స్వయంవరమని చాటింతురే. ఇట్టి వాక్యమాడినమాత్రమునం బా ప హేతువుగాదే. ధర్మమార్గము నగునేయని యడిగె. నట్లడుగునంత నాదమయంతియు ప్రాణనాథా! ద్వితీయస్వయంవరమని చాటించితిమేని

బాహుకుం డిమ్మోడకువచ్చె. వానితోడ రథసారథ్య మొనరించుచు
నీవును యీమెడకువత్తువని నిన్ను రక్షించుటకై యిట్లు కావించితిమి
కాని వేఱుకాదని కరకిసలయముల ప్రాణేశ్వరు పాదపద్మముల నంటి
భాష్పజలములం దత్పాదప్రక్షాళనము సేయుచుండగా నంతరిక్షమున
నుండి వాయుభట్టారకుం డానళుంగని ఓరాజా ఈ దమయంతీదేవి ఏక
భర్తృవ్రత పరమ పతివ్రత సూర్యుండును చంద్రుండును నేనును
మూడుసంవత్సరం బొక్కటిగాచితిమి. ఈ మాట నిక్కము. దీనియం
దెట్టి కలుషము బొనంగదనిపల్కగానే నళుండాక్షణమున కర్కోట
కుండు తన కభిమంత్రించి యిచ్చిన కరాటమును తెఱచి దానియున్న
వస్త్రమును గట్టినమాత్రమున తొల్లిటి నళమహారాజుంబోలి దివ్య తేజ
మున వెలింగె. అయ్యిరువురకు నన్యోన్య విరహపరితాపముతోడ నశ
రీర మలినమువాసె. పరస్పరానురాగముతో నభూషణ విశేషములం
విలసిల్లె అంత చంద్రునితోడంగూడిన రాత్రియుంబోలె ప్రకాశించు
చున్న యీ దమయంతీదేవింగని భీమసేనుండు సంతసిల్లి పురమును
అష్టశోభనము లలంకరింపజేసె. అట్టి మహోత్సవమున ఋతుపర్ణుడు
నళునొద్దకువచ్చి భూపాలా! నిన్ను నళుండని నేనెఱుంగక ఆశ్రితుడం
గాదలచి నీకర్మములుం జేయించితి. నీవు క్షమింపుమని నళమహారా
జుచే సెలవందియయోధ్యకుంజనియె

అంతనళుండు విదర్భపురమున నొక్కమాసముండి దమయంతీ
దేవి నయ్యెడనునిచి భీమసేను ననుమతమున రథగజ తురగ పదాతు
లంగొని నిషధ దేశమునకుంజని జూదమునం దన్నునోడించి రాజ్యము
గొన్న పుష్కరమహారాజుతో మరల జూదంబాడి యతని నోడించి
సకలమహీరాజ్యముంగైకొని పుష్కలంబై రాజ్యముతోనుండె. అంత
భీమసేను ననుమతము పడసి దమయంతీదేవి పుత్రులతోడ లక్ష్మీ
మహిమయు, పాతివ్రత్యమహిమయు వెలుగుచుండ ప్రాణేశ్వరుండగు
నళునియొద్దకువచ్చె. అట్టిదమయంతింగూడి నళుండు నిత్యలక్ష్మీవిభ
వుండై రాజ్యముచేసి ప్రాణావసానకాలమున దమయంతితో పరబ్రహ్మా
నందసుఖమునందె గావున యింతులు తమతమపతులను దైవముగా

దలంచి వారికెదుర్కొనక శుశ్రూషలుచేయుచు హితవులు బల్కుచు గౌరవములు జూపుచునుండుటచే పతివ్రతాశిరోమణియని ఎన్నంగబడియెను.

దమయంతీదేవి ప్రభావము ముగిసెను.





శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## ౫. సీతాదేవి ప్రభావము.

అనేకదినముల క్రిందట అయోధ్యానగరము నేలుచుండిన దశరథుండను సూర్యవంశపురాజొక్కఁడు కలఁడు. అతనికి ధీరోదాత్తనాయకుండును, భగవదంశసంభూతుండు నగు శ్రీరాముండను నొకకుమారుఁడుగలఁడు. అతనికి మిథిలాపురమును పాలించుచుండిన జనకమహారాజపుత్రియు సర్వశోభనలక్షణగుణసంపన్నయునగుసీతాదేవియను భార్య కలదు. ఆమె తనపతిని పరబ్రహ్మస్వరూపునిగా నెంచి ప్రతిదిన ముదయమున ముహూర్తమాత్రమునకు మునుపులేచి భర్తృపదారవింద ధ్యానము సేయుచు జలకమాడి పరిశుద్ధమగు మడుపుంగట్టి శుచియై

యుత్తమామలకు మ్రొక్కిడి వారిచే దీవెనలంది యింటగల పాచిపను లెల్ల తీర్చి దేవపూజాగృహము చక్కజేసి భగవదారాధనమునకై వలయు పత్రపుష్ప ఫలాది పదాది పదార్థములనెల్ల నాయత్తపరచి, యంత వంటశాలకుం బోయి వంటచాండ్రతో తనభర్త మనోభీష్టమగు భోజనపదార్థముల నాయత్తపఱుప నియమించి, అతిథి అభ్యాగతులం బూజించి వారికి ఆతిథ్య మొసంగి భర్త మొదలగువారల ప్రియవచనముల నన్నము పెట్టి వారు కుడిచినంతం బతిభుక్తాన్నపదార్థ శేషము దానుం గుడిచి సాధుజనములకు చింతామణివంటిదై అతిథి యభ్యాగతులకు కల్పవృక్షమువంటిదై, బంధుజనములకు కామధేనువువంటిదియై, యత్తమామలకు ముంగొంగు బంగారువంటిదై, పతికి ప్రాణమువంటిదై, పరమపతివ్రతాశ్రేష్ఠయునై మెలగుచు నొక్కనాడు ప్రాణనాథుండు సంతోషహృదయుండై యుండు తరుణంబెఱింగి చెంతంజని కరకమలముల ముకుళించి వినయ భయభక్తులతో సతనింగని మ్రొక్కి, దేవా, జీవాత్మకుం బరమాత్మకుంగల తారతమ్యమును, వాటిసంయోగవియోగములును, కామ క్రోధలోభ మోహ మదమత్సరములును, దూషణభూషణ తిరస్కారములుం బరమాత్మకు లేని చందంబున అహంకార మమకారముల సంసారదావానలమునంబడి పరితపించు నీజీవునకు విముక్తిబొందు నుపాయమును సవిస్తరముగ నా కెఱింగించి నన్ను కృతార్థురాలిం జేయవే యని మృదుమధురవచన రచనామృతబిందుసందోహము లొలుకం బ్రార్థించె. ఆ కాంత వచనామృతమున సత్పతి మనమును బీజం బంతలోనంత నానుడునడి మొలకయై తరుణవృక్షమై, చిగురై, మొగ్గయై, పూవై, కాయయై, పండునై నంత ప్రాణేశ్వరింగని యిట్లనియె.

వినవే గుణభూషణి! "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థితః" అను శ్రుతివచనప్రకారము పరమాత్ముండు ప్రకృతిరూపమునంబడసి అవిద్యావిలసితములగు పృథివ్యాప్ తేజో వాయురాకాశములనియెడి పంచభూతములం గూడి పంచవింశతి తత్వములతోడం గూడి లింగదేహియగు, అట్టిదేహమున పరమాత్మ సహస్రశిరములును, సహస్రనేత్రములును, సహస్రపాదములునుం గలిగె. అంగుష్ఠమాత్ర

పురుషుండై అహంబ్రహ్మాస్మియను ప్రణవనాదమున నుప్పొంగుచుండు పరమాత్ముండు లింగదేహమునందుండు నేని జీవాత్మయనియు, సాకారుం డనియును, అవిద్యాసంబంధమగు ప్రకృతినివిడచి విద్యాస్వరూపమున నుండునేని పరమాత్మయనియు నిరాకారుండని జెప్పబడును. అట్టి పరమాత్మ అవిద్యా విద్యలను నాయకీ నాయక భావములం గల్పించుకొని లింగశరీరుండై యందు నాయకస్వరూపకుండగు పరమాత్ముండై తాను యట్టిదేహమున నాయకిస్వరూపయగు జీవాత్మయై యట్టిజీవునకు కార్యకారణ హేతుభూతములగు బాధ్యబాధకత్వములం గల్పించి సూత్రకారకునిచేత జంత్రపుబొమ్మకై వడి యాజీవునిం గర్మయోగముల ద్రిప్పుచుండు నంతవరకు నట్టిపరబ్రహ్మమునకు సంయోగము ప్రకృతి సంబంధమగు లింగదేహముం బాసినేని యట్టి జీవాత్మయగు నాయకి తోటి వియోగమునుం గలుగునని యెఱుంగుము. కుమ్మరిచే నిర్మితం బయిన ఘటం బెట్లు విచ్ఛిన్నంబయ్యేనేని మఱల నెట్లుతగవో అట్లు పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశమనియెడు పంచభూతాత్మికమగు లింగశరీరమునుం బాసి విద్యం గ్రాహించెనేని యాజీవునకు వియోగంబునయు బెలియును మఱియుం జెప్పెద వినుము. పద్మాక్షీ సచ్చిదానందస్వరూపుండగు భగవంతుడు, యవిద్యాసంబంధమగు ప్రకృతిం గైకొని రాజస తామస సాత్వికములను మూడు గుణములంగూడి యందు అట్టి రాజసమున నహంకారములును, తామసమున కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములును, సాత్వికమున శమదమాది గుణములుంబుట్టె అట్టి సాత్విక గుణమే నిరామయ, నిష్కళంక, నిరంజన, నిరహంకార, నిష్కామ, నిరాకాశ, అఖండజ్యోతిస్వరూపుండగు సచ్చిదానంద బ్రహ్మము అట్టి బ్రహ్మము ప్రణవాకారుండై అహం బ్రహ్మాస్మియను నాదమున నుల్లసిల్లుచుండు. అదియే ప్రణవనాదమని చెప్పబడును. కావున త్రిగుణప్రధానమగు సాత్వికగుణము గైకొని యమము, నియమ, ఆసన ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, తపములనను నష్టాంగయోగము నవలంబించితి తాను నేను అను భేదభావమువిడచి అరిషడ్వర్గములనంటక పంచేంద్రియ వ్యాపారమును మరచి మన, బుద్ధి, చిత్తము, అహంకారము అను అంతఃకరణ చతు

త్రయములను అహంబ్రహ్మాస్మి యను పరబ్రహ్మమునం దైక్యపరచునేని
తాను నిర్వికారుండగు శుద్ధబ్రహ్మంబగు. అట్టి బ్రహ్మము విద్యయనం
బడు. విద్యయనగా జ్ఞానము. అవిద్యయనగా అజ్ఞానము. దీనినే మా
యయందురు. సూర్యకిరణములు సూర్యునితోడ యెవ్విధమున నైక్య
మై కనుబడకపోవునో అట్లు పరమాత్మతోటి జీవాత్మ లయిం నునేని
యట్టి జీవాత్మకు పంకమునందు కుమ్మరపురుపునకెట్లు ఆపంకంబంటు
దో అట్లు కర్మయోగములంటవు కావున మృగాతీ, ధనకనకవస్తువా
హన పశుపుత్రమిత్రకళత్రములు మొదలగువాటిని సంసారబంధం దో
చు నీటిబుగ్గలనియు, నస్థిరములనియు, క్షణభంగురములనియు నెఱింగి
నిర్మలహృదయముల భగవద్ధ్యానము చేసుచేని, అట్టివారికి జన్మముక్తి
గలుగునని పరమార్థోపదేశముచేసె. అట్టి పరమార్థోపదేశము వడసి
యా సీతాదేవి మనోవాక్కాయకర్మములను త్రికరణశుద్ధిగా షోడ
శోపచారముల పతిపూజనముగావించియాతనికి మన ప్రియముసేయుచు
రేయింబగళ్లు భర్తపదారవింద భజనముసేయుచు పతివ్రతామణియై
యుండె అట్లుండగా కొన్నాళ్ళకు వెనుక తన భర్తయగు రాముండు
తన సవతితల్లియగు కైక పతియగు దశరథునిచే గొన్న వరమునకుం
దగినఫలమును పొందుటకై దశరథుని ప్రార్థింపగానతండు అట్టికైక
పుత్రుడగు భరతునకు పట్టముకట్టి తన్ను వనవాసమునకు బొమ్మనిపల్క
గా సోదరుండగు లక్ష్మణసహితుండై వనమునకుం బోవలచె.

అట్టి సమయమున నా సీతాదేవి పతినిగాంచి దేవా రాజ్యలక్ష్మి
విభవములం బాసి, ధనకనకవస్తువాహనాది సంపదలం బాసి నీవు అడ
వులపాలై చని పడరానిపాటులం బడుచుండగా నేనుమాత్ర మింట
నుండి సుఖం బెట్లనుభవింతును. పతినియెడ బాసియుండుట క్షణముయుత్త
మస్త్రీలకు యొక్క మహాకల్పంబైయుండు. నాథు నెడబాసియుండు
స్త్రీయనాథ. పురుషుండింటలేకుండిన నట్టిగృహము రుద్రభూమికిసమా
నంబగు. పురుషుండింట లేని శృంగారమును పీనుగను శృంగారించిన
ట్లగు. పతినివిడచి తిన్న యన్నమును గోమాంసభక్షణమగు త్రావిన
నీరును శ్వానమూత్రంబగు. కావున ప్రాణనాథా, ప్రాణేశ్వరుండగు
నిన్నెడబాసి నిమిషమాత్రమైన నే నిరయ్యోడనుండ నొల్లను నన్నుం

దోడ్కొని పొమ్మని మిక్కిలి దీనాలాపముల నతని పదారవిందముల పైబడి ప్రార్థింపగా నతం డంగీకరించె అంత అట్టి రామలక్ష్మణులం గూడి దివ్యవస్త్రాభరణాద్యలంకారముల విడచి నారచీరలగట్టి వనము నకుం జనె.

అట్లుచని మహానియులగు ఋషుల దర్శించి వారిచే శ్రుతిస్మృతి పురాణేతిహాసధర్మముల వినుచు, పుణ్యనదీనదములం గ్రుంకులిడుచు, పుణ్యక్షేత్రములం బుణ్యపర్వతముల నివసించి, అహోరాత్రములు పతిభక్తి నేమరక కాలయాపనం బొనర్చుచుండె. అట్లుండగా నొకనా డట్టి యరణ్యమున లంకాధీశుండగు రావణాసురుండు యా సీతాదేవిపై మోహముగొని చెరబట్టుకొని పోవందలంచి మారీచుండను రాక్షసుని మాయామృగముగ గావించి వీరున్నయెడకుం బంపె. అట్లు బంపగా నామృగము బంగారులేడిపిల్ల వారిచేరువ చిందులుద్రొక్కుచుముందు వెనుకకు గుప్పించి దాటుచు మిక్కిలివినోదము లంగల్పించుచుండగా అట్టి మృగమునుం గని సీతాదేవి లక్ష్మణా, దీని గంటివే. ఇది మిక్కిలి ముచ్చటగ వచ్చుచున్నది దీని నాకెటులనైనం బట్టియిమ్మనివేడె ఆటుల వేడుచుండ లక్ష్మణుండామృగముం బట్టబోవు అది పట్టుబడక చాలాదూరము పారిచనె. దాని వెన్నంటి లక్ష్మణుండు నుంబోవు. అంత నమ్మాయామృగం బొక్కయెడ ఆ లక్ష్మణా యని నేలంబడిప్రాణములవిడిచె అట్టిసమయమున సీతయొంటరిపాటుననుండె

అంత రావణాసురుండాసీతంబట్టి తన రథముననిడుకొనిలంకానగరమునకుం గొనిపోయి శృంగారవనమునందును నొకయశోకవృక్షము క్రిందవిడచి రాక్షసస్త్రీలంగొందఱ నయ్యెడ గావలింబెట్టి మాయోపాయులగు మఱికొందఱ రాక్షసస్త్రీలంబిలచి యట్టి సీతాదేవినిసామభేద దాన దండోపాయములంబోధించి ఆ యింతికి నాపై వలపుబుట్టునట్లు చేయుండని నియమించె. వారంట ఆదేవినిజుట్టుకొని పలువిధముల బోధించుచుండగా, యామె యట్టివారిం గని పుణ్యవతులారా! మీ రేల యట్టి యపసతిపల్కులం బల్కెదరు "స్త్రీణాం భర్తృ వినా దైవం నాన్యంజన్మనుజన్మను" అని పెద్దలు చెప్పుదురు. స్త్రీలకు భర్తయే దేవుడు. అట్టి మగనిం బాసి పరపురుషగమనంబొనర్చు స్త్రీలు మహారౌరవనరక

మున బడుదురు. పరస్త్రీ పరపురుషగమనములును, జూదమాడుట
యు, కల్లుద్రావుటయు, దొంగిలించుటయు, అబద్ధమాడుటయు నను
నివి యైదును పంచమహాపాతకములని చెప్పుదురు. కావున మీరేల
వృథామాటలచే పాపము నార్జించుకొనెదరు. చాలుచాలు మీపెత్తు
లిక చాలింపుమని వారలం దిరస్కరించుచు వనవాసము జేసివచ్చిన
నాటనుండి నిరాహారయై సతియై సంద్రావక ధైర్యమును విడువక రా
త్రింబగలు భర్తృపదారవిందముల ధ్యానముసేయుచు, తనలో దాన
ట్లనుకొనెను. హా ప్రాణనాథా, నీకే యేకపత్నీవ్రతుండవై యుండవేని నేనే నిత్య
పతివ్రతనగుదునేని నీతో దండంబె క్షేమంబై యుండెనేని శీఘ్రకాల
మున నీవిచ్చటికి నరుదెంచి పంచమహాపాతకుండగు యీ రావణా
సురుని పదికంఠములం గసికిన నీబాణములను బ్రయోగించి నా చెరంబాపి
నన్నుం గొనిపోవుదుగాక యని నిశ్చయపరచుకొనియుండె.

అట్లుండగా కొన్నిదినములలో సుగ్రీవాంజనేయాది వానర బల
మునందనకు సహాయముగ గొని లంకాపురికిజని పాపాత్ముండగు రావ
ణాసురునిజంపి భర్తృవియోగదుఃఖమున మిక్కిలి గృశించియున్న సు
సీతాదేవిందోడ్కొని అయోధ్యానగరమునకు వచ్చి, అంత సీతం
గాంచి యోసుగుణభూషణీ, నీవు పతివ్రతాశిరోమణివై యుండుట
లోకప్రశస్తము. నేను నిక్కమెఱుంగుదును. అయినను లోకులం
దఱు రావణాసురుడు చెఱబెట్టు నీయొక్క భార్యను మరల నేలం
దెచ్చి పెట్టుకొన్నాడని నన్ను నిందింతురు. నాకట్టినింద కలుగకుండు
నట్లు నీవగ్నిగుండమునంబడి వెడలిరమ్మని పల్కె.

అంత నా దేవి తత్క్షణమున నగ్నిగుండమునంబడి పంచాగ్ని మ
ధ్యమున సుకుమారమగు దేహము కొంచమైనం గందక మేనివస్త్రం
బణుమాత్రమైన దగ్ధముగాక క్రొంగ్రొత్తలగు దివ్యవస్త్రాభరణమా
ల్యానులేపనములం గగి యగ్నిగుండమునందుండి జగన్మోహిని దేవత
లగున వెడలివచ్చి నిలిచె. అంత నా దేవిపై దేవతలు పుష్పవాన
లం గురిపించిరి. దేవదుందుభులు మ్రోసిరి. రంభ యూర్వశి మేనక
తిలోత్తమ మొదలుగాగల వేల్పునెలతలు వేణువీణామృదంగాది
వాద్యవిశేషముల మనోహరముగనాడిరి, మహనీయులగు నారద సన

హృదయములు బండె. లోకులందరు నా దేవింగని మెచ్చిరి పిమ్మట రాముండా సీతాదేవింగూడి పట్టాభిషేకమహోత్సవము గావించుకొని సమస్తభోగభాగ్యము లనుభవింపుచు సుఖముననుండె. అట్లుండి ప్రాణావసానకాలమున సచ్చిదానంద స్వరూపుండగు పరబ్రహ్మమునం దైక్యంబయ్యెనని చెప్పె. గావున యింతులు తమ పతులను దైవము దలచి వారికెదురాడనక వుచితములే చేయుచు హితములు బలుకుచు గారవములుజూపుచు నుండుటే పతివ్రతలకు నూటియని ఎఱుంగవలెను.

సీతాదేవిప్రభావము ముగిసెను.





శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.





## ౬. సంధ్యావళీదేవి ప్రభావము.

సత్యశౌచగుణశీలుండై మాళవదేశము నేలుచున్న స్వదేశమహారాజను సుగుణవ్రతయగు మంగళవతియను భార్యంగూడి సంధ్యా

వళియను పుత్రికంబడసి సత్పుత్రికను దినదినము అతిగారాభమున నారీ
రత్నంబన నుతికెక్కబడిన ఖ్యాతింగూడి ముద్దుగ పెంచుచుం
డెను. నాబిడ్డకు యవ్వనము వచ్చెనిల్లగానే సమ్మహారాజు అతిశృంగార
ముగు నగరు నిర్మాణించి కన్యకామందిరమును నిర్మాణించి సకూర్పుతో
నియమించి సఖీజనములు సేవించ దాసీజనములనుండనిచ్చి అతి జా
గ్రతలు హెచ్చరించివచ్చుచుండెను. ఆ పురమున సకలస్త్రీలందరు ఈ
బిడ్డను జూచినవారాశ్చర్యమున సంభ్రమమునవచ్చి దిగ్భ్రమనుజెంది ఓహో,
యిదేమిరూపము. యిదేమి తేజము. యిదెక్కడి వయస్సు ఇదేమి వింత.
ఈ పాప దేవలోకమున జనించక ఈ భూలోకమున జనించిన కారణ
మేమో యిదిరంభయో, యింద్రాణి యిందొచ్చెనో, లేక పార్వతి యి
టుల జనించినదో, లక్ష్మీదేవి ఈ అవతారమున యిమ్మహారాజుకు
జనించినదో, వనదేవతనో, జగన్మోహినియోయని నానావిధములదలం
చుచు విస్మయమందుచుండిరి. అట్టి నాసద్ధ్యావళి శాంత శమదమగుణములు
గలిగి విగుణములు తొలగి అష్టాదశ వేదశాస్త్ర పురాణేతిహాసముల
తేటగలిగి మహాశీలవతియై దానములతో అలరారుచున్నంత నాక్క
డు స్వదేశమహారాజు తన మంత్రులను రావించి ఓ మంత్రులారా,
భూలోకమునగల రాజపుత్రులలో నెవడు తలిదండ్రులయందు విశ్వా
సముండును, గురునియందు భక్తియు, దేవునిబూజించుటయు, అతిథి అ
భ్యాగతులను బూజించుటయు, ఆదరించుటయు, సాధుజనపోషకుండును,
సకలశాస్త్రపురాణేతిహాసముల సమర్థుండును, సకల ధర్మములకు పర
తంత్రుడై, భగవదర్పణముచేయువాడును, సదా సాధుసంగముండును
నగు పుణ్యవంతుండైన రాజపుత్రునకు నాపుత్రికనిచ్చి వివాహముచేయ
యిచ్ఛయున్నది. గనుక అట్టిపుత్రుండెందున్నాడు. నాకానతియ్యుడన
చతుర్విధోపాయులగు మంత్రులలో ప్రథమమంత్రి రాజుగారినిచూచి
నమస్కరించి ఓ సార్వభౌమా, తాము మందలించినరీతి, రాజపుత్రిని
ఎందు లేగాని నెమ్మదిగొనియుండ బోరెవరు. అయినను, ఈ
భూలోకమున విదర్భదేశాధిపతియగు, సగరమహారాజు కొమారు
డైన రుక్మాంగద మహారాజను సుపుత్రుడు. మీ కోరిక ప్రకారము
యెల్లవిధముల తమయుల్లము రంజిల్లజేయు వల్లభుండు. అట్టివాడు

తిమకు అల్లుడయ్యెనేని తమ రాజ్యమునకు ఆపదలు వాటిల్లునా; పరుల శౌర్యములు చెల్లునా; శిష్టములు కొల్లలగునా; దుష్టులు మెండగునా; తిప్పటలు మాని భండారమున చెప్పరా; సిరి ద్రవ్యములు కుప్పలుగా చేరవే; అట్టివానిగై కొనవే యని బలికి రాజుగారికి నమస్కరించి నే అట్టి కార్యమునకు నొడంబడనలయు ప్రయత్నములు చేబూనెదను నాకాజ్ఞ యివ్వుండని వృత్తగపుపొంది నెమ్మదిజెంది చిత్రరేఖను రావించి రాజపుత్రియగు సంధ్యావళిని జూపించి దానిరూపును పటమున వ్రాయించి భటులచేతికందించి ఓరీ భటులారా, యీ పటమును జాగ్రత్తలు మీర విదర్భకు పోగిడని సభకు జేర్చి రాజుగారిచేత కందించుడని చెప్పి చేతికి పత్రమునిచ్చి బంపగా వారలీజాగ్రత్తతో మెంటుని శోభన యింతో నిండు భయముతో హూటాహూటి పడుచుతో విదర్భ కేతెంచి కావలివారలు సభలో నిలచి రాజుగారికి నమస్కరించి ఓ రాజాధిరాజసార్వభౌమా! పరాక్రమశీమా! యెన్నరాని ధానమా! సూర్యతాభిరామా! ఈపటము గొనుమా! దీనిగనుమా యని చేతికందించగా రాజతిప్రీతుండై పటముగల హస్తుండై యాశ్చర్యము నొంది యిట్టిరూపుగల దేయని తెలిసి సంతోషమునగలసి కుమారునిపై జ్ఞాపకమునకు పటమును తనకొమారుడగు రుక్మాంగదునివద్ద పంపగా రుక్మాంగదుడు పుచ్చుకొని అట్టి చిత్తువతా నిలచి కటకటా ఈ రాచపట్టిని మొల్లు మట్టుమితము లేక యిట్టి రూపముకట్టుపరచిన జగత్సృష్టికి యెంతలెవన బ్రహ్మని నిట్టూర్పులతో చూచి కఠినమనసునోర్వలేక నాకేల కలిగె కాటులు రాక మరుశర మెయిసోకి మూర్ఛిల్లి కొంతసేపటికి తెలివిగలిగి ధిక్కరించి తొలంగా రుకుమిల్లి రుక్మిణీ చెలి చిలుకకొమ్మరౌరా నాగునిములుకో రతిచేతి చిలుకో ఈ జవరాలు రూపురాలు కోమలాలు కోటిపరాలు జేయునే అహాహా, అదేటిబోటి కుచములు కుంభములకు సాటి యిది యింతులకు మేటి నెల తేనికికేటి ఇట్టితే సేవరింప అట్టిది నన్నుగారవింపబట్టినపద్దు చెల్లింప పట్టాభిముందునా రాజు నాగించ తలిదండ్రులు సొంపులు నింప శోకములు దయింప సందియములుగలగా లేనులేని విరహానలమున దగిలి నిద్రలు మాని యురములు ప్రణామునుగొని తాంబుడీగొని తహతహల వెతలగొని శయ్యపైగొని సంధ్యావళి ధ్యానముగొని సదా మన్మధావేశముగొని

కృశించుచున్నాడని సేవకులచే దెలిసికొన్న సగరమహారాజు పురోహి తులరావించి తన పుత్రుని యుద్దేశము ఎరిగించి మంచిముహూర్తము నియమించి మాళవ దేశమునకు జాబులు లిఖయించి తలంపులు దెలి పించి మంచివార్త విన్నవించి ముహూర్తపత్రికల గమనించి శీఘ్ర మున రండని యాజ్ఞాపించిన వారలిభయభక్తులై అతివేగమున మాళవ దేశముజేరి స్వదేశమహారాజునుగోరి నెమ్మది గ్రమ్ముకొన్న మనము తో కమ్మనియ్యగా నారాజు విచ్చిచూచి మచ్చికతో మనసు మెచ్చి వచ్చినవారిని ఆదరించి మంచిమృష్టాన్నపానాదుల బుజ్జగించి వొజ్జలం బిలచి మజ్జనములగుసైన్యమును సంగీవాద్యమేళతాళభూరికాహళాది తెత్రి వాద్యముల ఆర్భాటముతో రథగజతురగసమూహములతో పుర పౌరాణీ పరివారముతో బయలుదేరి సంధ్యావళి వివాహమహోత్స వము నెరవేర్చుకొన వచ్చెదము శీఘ్రమున ఆయత్తపరచుమనిన వా గతిప్రియమున అతిత్వరలో కావలయు ద్రవ్యములు సామగ్రులు సమ జేర్చి విదర్భదేశముచేరి సంతోషముమీరి కల్యాణమంటపము దూరి ముహూర్తముగోరి మంగళవాద్యములు పూరి వొండ్రొరులు చేరి దంపతులకు మంగళస్నానమును గావించి సుంచికుసుమములు చేమించి తలంబ్రాలు బెట్టించి మహోత్సవము గావించి విందు లారగించి ప్రముఖులై అల్లుని వెంటబెట్టుకొని తన మాళవదేశముచేరి కొన్ని దిన ములందు వుంచుకొని శోధనములనిచ్చి మచ్చికతో విదర్భకంపించెను.

అట్లు పంపబడ్డ నారుక్మాంగదుడు అత్తమామలవద్ద సెలవొంది దండుదళములతో అతి అలంకారముతో ఆనందగారాబముతో విదర్భ దేశముజేరి తలిదండ్రులకు మ్రొక్కి మక్కువ లెక్కించి మంచిభా ర్యాతో మించిన సంతోషముతో ధనకనకవస్తువాహన రథగజతురగ పదాదులతో భార్యాసమేతుండై, సామ్రాజ్యలక్ష్మీసమేతుండై మను నీతిమంతుండై సగరునికి ప్రియపుత్రుండై పౌరులకు హితుండై సుఖం బనుభవించుచుండెను.

కట్టిగ అట్టి రుక్మాంగదుని పత్ని యగు సంధ్యావళి మగడే దైవమని నమ్ముచును, మగనినామమే తిరుమంత్రమని దలచుచు మగనిసేవలో భటులును, మగనిగారవించుచు అతనికి హితములుబలుకుచు పూజకులవల

యువాటినన్ని పుష్పములున్ను పూజపాత్రలున్ను, ఆయత్తపరచుచు
పతిమాట జవదాటక సహముగనుచు నిత్యసేవలుఁజేయుచు అత్తమా
మలకు వెరగుపడుచు వంటశాలికేగి తన భర్తకు హితమగు పదార్థ
ములను యత్తమామలకు వలయు భక్ష్యములును, లక్ష్యముంచిచేయున
ట్లు వంటవాండ్లకుత్తరవొసంగి అన్నివిషయములను బుద్ధియును అతి
జాగ్రతగలదియై అత్తమామలకును అతిథి అభ్యాగతులకు అన్నములిడి
భర్త నొసంగిన వెనుక మిగిలిన శేషాన్నము తాను భుజించి పెద్దలవల్ల
ఆశీర్వచనములుపొంది అత్తమామలచే ఖ్యాతిజెంది మగనిచే విశ్వాసము
లందివచ్చుచున్న కొంతకాలమునకు అవల అత్తమామలు స్వర్గము
పొందిరి. అంత రుక్మాంగదుడు శుచిమతుడై తానా కార్యము నుచిత
ముగా జరిపించి తన విదర్భదేశమునకు దానేరాజై మకుటము దాల్చి
మనునీతి తొలగనీయక ఇంపుతో సవరింపుగ పురజనులపై ప్రియము
మిన్నగ ప్రజాపాలనము జేయుచు వచ్చుచుండె. ఇట్లు జరుగుచున్న
భర్తకు సంధ్యావళి మనువునన్న అధికముగా ఉపచర్యల చేయుచు
మచ్చిక తెచ్చింపుచు వచ్చుచున్న యెన్నిక గొన్నవాడై తొంబది
తొమ్మిదికన్నెలను పాణిగ్రహణముచేసికొనెను. అట్టి మహోత్సవమునకు
సంధ్యావళి ముందుండి యతివిమర్శగా జరిపి భర్త మనసునకు సంకట
ములేక నెమ్మదిగొన్నవాడాయెను.

అట్లున్న పట్టమహిషి మిసిమిరుచి తొంబదితొమ్మిది ఇంతులలోనంతు
ష్టిజెందుచు కాంతుని కేళి విహరించుచు పంతముచే మించి విచ్చలవిడి
యుండెను. అటులున్న భర్తకు కాలముతప్పక స్నానములు తెచ్చుచు
పూజాపాత్రలు శుద్ధపరచి పూజాగృహము పరిశుద్ధిచేసి ఆయత్తపర
చుచు భర్తరాకకెదురుచూచుచు వారిని స్నానసంధ్యల దేలించుచు
హితముపలుకుచు ఇష్టాన్నములిడుచు శేషములంది తాను భుజింపుచు
పతిస్మరణజేయుచు గతినీవేయని మొంచుచు యతిభక్తిమించి దినము
తప్పక జరుగుచుండె.

అట్లున్న భార్యంగాంచి ఓనారీరత్నమా! పతివ్రతాశిఖామణీ!
నామమునీదే నీయంతటిదాని నేనెందు గాన లోకములోన యు
అని భార్యంజూచి సంతోషించి రారమ్మని బుజ్జగించి ఆదరిం-

మనస్సుగలవాఁడై తొంబదితొమ్మిది స్త్రీలనుబిలిచి వాండ్లకు వలయు నట్టికార్యములను నియమించెను. అదేమనగా, భటులచే శృంగారమగు నందనవనం బొంగునుండఁజేసి అందు కావలివాండ్రను పారాలు వేయించి బొండుమల్లియలు, నిండుగోజాలు, పందు సంపెంగలు, దిండుపూపొదిళ్లు, సురపొన్నలు, జాజిచామంతులు, కేదంగి, గొజ్జంగి మొదలగు ప్రసూనవృక్షములును, వటపిప్పల నారికేళాది గొప్పవృక్షములు యిందీవరములిచ్చు సంపెగములును వనముల నిండఁజేసి పూజార్థమునకై వలయు పత్రములు నేత్రానందముగా పెచ్చియున్నట్లు యీ తొంబదితొమ్మిది స్త్రీలకు ఆజ్ఞాపించి తాను మునుపటియట్లు పట్టపుమహిషితో సుఖంబందియుండె. అట్టి వనమునుజూచిన నరులు మునులు యింద్రాదులు భ్రమలుజెంది అత్యాశ్చర్యమున గాంచి ఆశలు గొనియుందురు. అప్పుడు జాబాలమహర్షి యావనముంగని అత్యానందమునుజూచి అందులో ప్రవేశించి పర్ణశాల గావించి నివసించి తపము గావించుచుండెను.

అట్లున్నమహర్షి తపముజేసుకొని నెమ్మదిగాయున్న కొన్నిదినములకు అవల అమరలోకమున యప్సరసలు భూలోకమునకేతెంచి యీ వనములోని పుష్పములు ఈశ్వరారాధనకై గొనిపోయి ఇంద్రుని వశమిచ్చి తిరిగి అంటు తృప్తిజెందుచున్నవారలు యిటుల ప్రతిదినమున్ను గొనిపోవుచుండ యావనములోని పుష్పములు దినదినే తగ్గుచుండెను. అది తెలిసి రాజస్త్రీలు దిగులుగొని యేమిచేయుదుమని భయమునచని రాజుగారిని నమస్కరించి మనవనములోని పుష్పములు దినదినము తగ్గుచున్నయది. ఆపుష్పములు కొనిపోవువారెవరో తెలియలేమని చెప్పినమాత్రమున రుక్మాంగదమహారాజు కోపాగ్నిపితుఁడై తలవరులను వనచరులను కావలివాండ్లను రావించి దినదినము వనములలోని కుసుమములు దొంగలపాలగుటను మీరు గుర్తెరుగక యశ్రద్ధగాయున్నవారలు కాబోలు ఇక మూడురోజులలో నాచోరులను కనిపట్టి కట్టిగొట్టి తేకపోతిరేని మీకు తగుపాటి దండన విధింతును. తప్పిదమునకు పాత్రులగుదురు. జాగ్రతగాపోయి తీసుకరండని ఆజ్ఞాపించిన నాభటులు భయము నొందినవారై ఆహారనిద్రలుమాని వొకరికొకరు పా

రాలిచ్చుకొని యతి వృషాయుతో పొరరింద్లడాగి వృక్షముల మరిగి నీళ్ళ
లోమునిగి తోటంతయుదిరిగి యపుష్పపూచిన పుష్పములు గానకపోవు
టను దెలిసి దొంగను వెతకివెతకిగానక రోసి వేసారి సడలిరి.

ఇటుల రేయింబగలు కాచియు దొంగను గనుపట్టలేక యచ్చోట
తపముచేయుచున్న జాబాలమహర్షిం గాంచి యితడే నా పుష్పములు
గొనిపోవువాడు అతను చేయునది తపము యితనికి పుష్పముతో పనియే
మున్నది యవశ్యములేదు ఐనా క్షుద్బాధకై భుజించుచున్నాడేమో
తెలిసినదిగాదు. ఎందుకైన ఈతని రాజుగారి ముందు నిలిపితిమేని మనల
యందు నేరములేక తప్పించుకొనవచ్చునని నిశ్చయించి నమ్మహర్షిని
గారాబముతో రాజసముఖముశేర్చిరి. అట్లేగుదెంచిన నమ్మహర్షింగాం
చి రుక్మాంగదుడు సింహాసనమువిడిచి లేచి యర్ఘ్యపాద్యాది పూజలి
చ్చి ఆసనమున నుండనిచ్చి కుశలముల విచారించి ప్రసూనములు గొని
పోవు దొంగలను దెలిపించి చేతులునోడ్చి నిలుచున్న రుక్మాంగదరాజుం
గాంచి మందహాసవదనుండై యరవిందముల వాతెరం దెరచి ఓ రాజ
శేఖరా రిపుభీకరా యతివుదారా సుందరాకారా నిరామములో యున్న
యరవిందాది మల్లికలు యుల్లమర యుల్లమర యింతులు పంతముచే
యిందీవరాక్షుపి పూజార్థమె గొనిపోవుచున్నవారలు నీ పుణ్యావశేము
యెట్టిదో నీభాగ్యమున యింద్రులకు భోగ్యమై ఆగ్రహించుకొని నిన్ను
కొనియాడుచున్నవార లట్టిపెఅదృష్టంబెవరికియబ్బునని చెప్పినమాటలు
విన్న రాజు చాలాసంతోషించి నమస్కరించి దేవా, యట్టిపుణ్యావం
తులగు దేవతలను నేనుజూచి యానందింపగోరుచున్నవాడను గావున
వారలనాకినుమంతచూపవలయునని వేడిన నమ్మహర్షి సంతోషించి నీవన
ములో యేటిపుచ్చ విత్తనములు తోటంతయు చల్లి విస్తరింపజేసితివేని
వారల నీకు జూపగలనని చెప్పి ఎప్పటియట్ల తపసునకు వెళ్లెను.

అంత నారాజు యేటిపుచ్చ విత్తనములుచల్లించి యవి మొలక
లెత్తగానేదాని స్పర్శదగిలినమాత్రమున నా యప్సరసలు పైకెగయ
నేరక యచ్చోట తపించుచుండగా నమ్మహర్షి రాజుగారిని రప్పించి
దివ్యజ్ఞానములిప్పించి యందువలన వాండ్లను జూపించి వారిదర్శనము
చేకొన్న రాజు వారలతో మాట్లాడి యెవరని దెలిసి ఈ యమరులు నుర

లోకమునకరుగ న్యాయములరసి ఏకాదశీవ్రతఫలము దత్తంబుగావించి ఆవ్రతమహాత్మ్యంబు తానెంచి మంచిదని లోకంబున చాటింప తాను తనతో చేరినరాజులున్ను, జనంబులున్ను, వ్రతంబుసమిన్నుచు, శతవర్షములు జీవించుచు, మితిములేని వైకుంఠపదవులందుచు, అకాలమరణంబులు లేక సుఖబుననుండిరి యిట్లుండ యమపురంబు దిన దినంబున క్షీణాగతింజెంది యముడు దిగులొందివుద్యోగంబునకాని యాహా, యింతటిపనిపూని మనకు అధికారంబులేనికాలంబువాటిల్లనేయని ఎంచి మహిషంబు నెక్కి మైజిక్కి చింతనుదక్కి నలుదిక్కులు నిక్కి నిక్కి సత్యలోకమునకేగి బ్రహ్మనుడాగిశిరమ్ముప చేతులుజేర్చి ఓజగత్సృష్టికర్తా! శారదాభర్తా! సంసారవిరక్తా! నన్ను బ్రోవవే నా చింతలు మాన్పవే నాకొలువు నిలువలేవేయని ప్రార్థించి మొకుట నిలువంబడి ఓ తండ్రీ, భూలోకంబున విదర్భదేశాధిపతియగు రుక్మాంగదుడు ఈ దేవతవలన యేకాదశీమహాత్మ్యంబు తెరిగి ఆక్రమంబు ననుష్ఠించుచు అకాలమృత్యువులందక శతవర్షంబులుపొందక స్వర్గంబునందు నున్నవారలు నాపురం బెవరున్ను అందిచూడరైరి నేనేమి చేయువాడను. నాకొలువు చాలించుకొనెదనని చెప్పిన యమునిమాటలు విని విరించి యముని నూరార్చి నీవు యూరకపోయి జేరుము. వాని తపము బోగొట్టి నీపురంబు గట్టిపంపెదనని జెప్పి యమునిబంపి సింహాసనాసీనుండై అమృతకలశమెత్తి చేతనిడుకొని యక్ష కిన్నర గరుడ గాంధర్వాదిసురులు అసురులు నరులు తపోధనులు మొదలగు రాజశ్రేష్ఠులందరు వ్యామోహముమీరి కట్టినమనసునూరి తపంబులేనూరి నేమంబులుజారి నాకీరత్నమునే జేరియుందునట్లు సమ్మోహసుందరియగు లావణ్యవతియగు నొకజగన్మోహిని నిర్మాణించి నీవు మందరగిరి యందున శృంగారవనమున నవరత్న తూగుటుయ్యాలలో నపినా గానమున విన్నాణంబు గానియుందువు యన నాసౌందర్య మోహిని అట్లే భూలోకమే తెంచి తూగుటుయ్యాలపై విహరించి వీణచేమించి మంచి గీతంబులుగావించి రాజునెన్ని గ్రాంచియుండెను. ఒక్కనాడు రుక్మాంగద మహారాజు పురజనులు మృగంబుల బాధకోర్వలేక రాజుగారితో విన్నవింపగా వారు మృగవేటకైజని విపినమునదగిలినానావిధమృగంబులను

జంపి నాశముగావించి యెంతును నొకజంతువులేక చేసి గాలియున్నసమ యమున బ్రహ్మదేవునిచే నిర్మాణించి విడువబడ్డ నొక మాయాజింక అ చ్చోటికొచ్చి రాజుగారియెదుట నిలువగానే రాజుగారి దానిజూచి మో హించి యాహా దీనమేనిశ్చయమైన పట్టికట్టి నా ప్రదేశముగొని గారా బమున పెంచుచుండ నెంచినవాడై శరముసంధించివిడువగ నామా య లేడి పరుగులిడి చెట్లమరుగునగూడి రాజుకెదుటనిలవబడి నృత్యము లాడి విలిచెడు నామేణమునుజూచి రాజు తరిమితరిమి బహుదూరము పోయిపోయి సైన్యములు దిశలుమారి తానొంటరియై వనములోదగిలి బడలి యెండకోర్వక తాపంబు హెంపుక చెమటలుపోక గుఱ్ఱమువిడచి మఱ్ఱిచెట్టుక్రింద పరుండి విశ్రాంతిజెందెను

అట్టి సమయమున నిదాఘసమయమున మలయమారుతము వెడ లినప్పుడు పుష్పములమీఁద బడినీళ్ళలోదిగిచల్లనిగాలితోపాటు చందనమున ముంచి సువాసనయు యింపుసొంపులిల్లునట్లు గుప్పుగుప్పున గుప్పుచున్న తావుల ఘ్రాణించి ఆహా యిదేటిగాలి నిర్జనమయమైన యీ అరణ్యంబు యీలాటిగాలియేమి తెమ్మెరలుగాన యేదో నారీరత్నము దునుకాబోలు ఓహో యిదేటిగానము వీణాగాన మోహనపతి పలుకుచున్నది దాని జాడ సలయుననదలంచి ఆచోటువదలి మెల్లన గదలి గిరిదరిజేరి కంఠధ్వనివిని విస్మయంబంది మెల్లమెల్లన నప్పల్లవ పాణియెదుటంనిలవంబడి దానిరూపురేఖలంజూచి ఆహా యిదేటి చంద ము యిదెంతటి అందము మతిపోంతవిందనుసి ఆనందమునమునిగి మ నసుకరగి శ్రమనతొలగి విరహముచెలగి యిది యింద్రాణియో సచీ మతియో వనదేవతనో రంభనో మిన్నుదలి చంద్రుడు యీ అన్నువ ముఖమునయున్నాడే యిది ముఖమా గాదుగాదు అలచందురుడే అను కేంద్రుని చేతివిల్లుయేమారి యీభామామణి నొసటనుంచియున్నాడే యిదినొసలేనా యిదిగనుస్సే ముద్దులచెలగి వద్దికతోగాంచెడి అద్దము లోగాను యిది కపోలములే పూవిరిసంపెంగ దీనినాసారూపమైయున్న యది యదిసంపెగనా యిదినాసికయే గంధమునీరిగిన గంధపుమ్మొదలా నుకరించుమాత్రించెనె సన్నుతాధరమో యిది అధరమే వజ్రమ ణులబారులీరి గన్పట్టుచున్నవే యిదివజ్రములారదనములే యీ నళినికి

గల శంఖవల్లిబోలినగళమా దీనివర్ణింప నావల్లతరమా కుంభి కుంభం
బులబోలిన కుంచకుంభములు లక్ష్మీకుంభములో బంగారు కుండలో
పళపళని ప్రకాశించుచు మించుతీగనో నాగకన్యశరీరంబు బంగారుతీగెనోవన
జమృగరాజును జయించినజఘనమో యిది నడుమేనా తొండంబులో
లేక యిది శాపుతోనా నాళంబులో గూడిన అరవిందమో లేక యిది
కరసాలమో శృంగారమై మెఱసెను రంభాస్తంభంబులో యిది తొడలేనా
యని చాలా వితర్కింపుచు వేళ్ళు సోల్పుచు మైపోగను తపించుచు
పదియుండోచక వెఱ్ఱిగానిల్చి రొగులుగాను చుయున్న రాజుంగాంచి మో
హిని సంతోషించియుండె రుక్మాంగదమహారాజని తెలిసి యిప్పుడు
మనమోహంబున దగిలియున్నాడని నిశ్చయించుకొని లక్ష్యంబుంచక
వీణవాయించుక యుండెను

అంతట రాజు కామోద్రిక్తుండై నోర్వని తాపము గలవాడై
సమీపంబుజేరి ఓ యిందువదనా! సుందరనా! శృంగారసదనా! గజగమ
నా! సురతనాదనా! నివెవ్వరవు? నెనెందుండి వచ్చితివి? యీనిర్మానుష్య
యరణ్యంబున కేమి పని? నీపే రేమి? నీయూ రెద్ది? నాతో ముద్దుగుమ్మా
నాకు తెలియజేయ రచమనివేడ నారాజును గాంచి ఓ రాజా! నేను సురను గాను
అసురను గాను; యీ వనమునయుండు వనదేతను గాను; నేను బ్రహ్మ
నిర్మాణంబున బుట్టి బ్రహ్మపుత్రిని. నాపేరు జగన్మోహనాంగి. నేనుండు
నది బ్రహ్మలోకంబు. నాకుండదగిన భర్తలేక యీభరతఖండంబున
కేతెంచి యీమాలు అంమనసనిలచి త్రిలోకులందైన రాచభర్తను వీక్షించి
దైవభక్తిని మించియున్న దానను గావున ఏకాదశీవ్రత పవిత్రుండనైన
భూపతి నాకిష్టనేను నేనాతని వివాహంబుజేసికొని సుఖంబున యుండు
దానననిమోహిని చెప్పినమాటను విన్న రాజు అతిసంతోషమున నా
యింతింగాంచి ఓమదవతీ! యి దేవివర్భదేశాధిపుడను. నాపేరు రుక్మాం
గదుడ. నేచేయునది ఏకాదశీవ్రతంబు నాపూజవిష్ణుపూజ నాకొడంబర
చునది మనునీతి దానిమును నిని అతిథి అభ్యాగతులను పూజించిబీద
లనుగారవించి పురజనులనాదరించి సత్యంబునేతలచి రాజ్యంబు నడిపిం
చుచున్నాడను నేనేను రారమ్ము నాముద్దుగుమ్మాయని దానిహస్తంబు
ముట్టబోయిన అది కోపినమనస్సుతో ఓరాజపట్టీ! అట్టియుండుము ముట్ట

బోకుము. నాపట్టువినుము. నీవట్లుండువేని నేనరికట్టి వివాహము గట్టిగా పెట్టుకొందు ననిచెప్పగా నారాజు కామపీడితుడై ఓ మదవతీ! యిదిగో సతిగ నిను జేరితి బల్కు మారీతి జరిగెద యని బలికిన బల్కుల విని యక్కలి కి దే సమయమని తలచి ఓ రాజా, నాకొక ప్రతిజ్ఞ గలదు దేవా వ్రతశీలుం డైన నీకు నాకోరిక ప్రకారంబున తప్పు జరుగవలదు నాకు వలసిన ప్పుడు వరంబొందు వేడెదను. అందుకొడంబడి పుండరీకాక్షుని పాదంబు లెరుగ ప్రమాణంబు జేసి యియ్యవలయు. అట్లు చేసి నాయాజ్ఞను దాసి యుండువేని సందియంబు లేక చిందులువొందగ గావించుకొనెద యని వచింపగా విని రాజు ముందువెనుక గమనించక దాని మోసపుపలుకులు దెలియక అట్లే భగవంతుని పాదంబుల కెరుకగా నీవు కోరినప్పుడు నీ కోర్కెయగు వరము లిచ్చెదనని ప్రమాణ మొసంగెను. అట్లు గైకొ న్న మోహిని గాంధర్వవివాహంబు గావించుకొని సురతక్రీడల దేలుచు చాటీతుల మీరుచు వనంబుల విశ్రమించుచు మందగితుల నడచుచు నొం డొరులు చేతులూచుకొనుచు వనశాఖంబులూగగింపుచు నెలమేట్ల విహా రింపుచు తలగ్రిడింపుచు సంతోషంబున నుప్పతిల్లుచుయుండిరి.

అట్లు తనకు వశమైన మోహినింగాంచి ఓనారీరత్నమా! మనమీ యరణ్యంబున యుండుట బాగుగాదు మనరాజ్యంబున కేగెదము రమ్మని యాగుమ్మను వెంబడించుకొని తనపురంబుచేరగానే సంధ్యావళి గాంచి సంతసించి తనకొమారుడగు ధర్మాంగదునిబిలిచి ఓరీ అన్నా! పినతల్లి యగు మోహినీవల్లికిన్ని మీ తండ్రిగారికిన్ని వివాహ మహోత్సవంబు చేయవలసియున్నది గనుక వలయు సామగ్రులున్న ద్రవ్యంబులను ఆయత్తపరచి ఏబదియైదు దేశాధిపతుల కుత్తరంబుల వ్రాసి ముహూ ర్తంబు నిశ్చయపరచి పురోహితుల రావించి పంపుడన నాసుపుత్రుండు కులపురోహితుల రావించి ముహూర్తంబు నిశ్చయించి సిబ్బందుల కెచ్చరించి వలయుసామగ్రులు గ్రహించి సైన్యంబుల రావించి యేబది యైదు రాజులకు దెలిపించి పత్రికల లిఖితము జేసి బంపెను నట్టి ముహూ ర్తసమయము సంధ్యావళి తనసవతికి మంగళస్నానముల గావించి ఆభరణము లలంకరించి వస్త్రమును గట్టించి పుష్పములను బెట్టించి నట్టి రాజు గారిని చేయించి కళ్యాణమంటపమున నిలిపించి క్రమము తప్పక

వ్రతముగూర్చి తపముచేయుమని వేడగా రాజు వొల్లక యుల్లమునఁ గోప మల్లికొని పల్లవాధరిని జూచి మూఁడు దినంబులు నీముఖము నేజూడ నొల్లనని చెప్పగా నామోహనమూర్తియగు మోహిని రాజునుజూచి ఓరాజా సత్యశౌచ శిఖామణీ నేచెప్పినట్లు వినెదనని చెప్పి యిప్పుడు యిట్టి తప్పి బ్బులాడుచున్నావే యిదిన్యాయమగునా నాకిచ్చిన ప్రమాణప్రకారము నాకువలయు వరంబు లిప్పుడు ఇవ్వవలయునని వేడగా అట్లైన నేదికావలయు నన్నను వాటినొసంగెదను నేడు మీనాయింతి చెంతజేరి ఓకాంతుడా, నన్ను కంతుకేళి నేలింప నాకు యిష్టపరము యిమ్ము యమ్మా యని యడిగిన నారాజుజూచి ఓసీ, నీవు నన్ను మరుకేళిగూడు వరమునప్పు మ కేదిగోరిన తీరకనిచ్చెదనుయిందుకు మాత్రము ఒనగూడదనని బల్కిన బల్కులువిని అక్కల్కి యేమియుందోచక ఈరాజు మోసబోడని తెలిసి యెద్దియుపాయమని కొంతనడవు నాలోచించి ఓ రాజా! నీవు మను నీతిననుసరించి సత్యశౌచములు గమనించి విష్ణుపూజల నుంచి వ్రత ముల పరిశీలించి పెద్దలపోషించి ప్రజలననుసరించి మాట తప్పనివానికి నాయందు జేసిన ప్రతిజ్ఞ మరచి మూడు బల్కుట న్యాయమా యని మందలించిన యామనోహరాంగనుగాంచి ఓసి, నట్ల క్రీడ నలుపు టలుమాని తక్కినవాటికి మోసంబడదనని చెప్పిన వినక నావ్రత భం గముచేయ నీకు న్యాయమా ఓసాధ్వి యెంతటి వ్రతము, అడినమాట తప్పక జరుగుటొన్న సత్యవ్రతమునందె యెక్కుడు వ్రత మెందున్నదే వార్తదప్పినవాని వ్రతమెంత పరిశుద్ధమైనను నిష్ప్రయోజనమని తెలియ లేవే నీవెరుంగని న్యాయముగలవే రమ్మురమ్ము శయ్యపై కొమ్మకొమ్మని నమ్మిన మోహముతో లాగిన మోహినింగాంచి ఛీ ఛీ విడువుము నన్నం టబాకుమని కసరి చేతులువిసరి ఆతురమునక్రోసి చాతురముతో లచ్చి మగనింగూడి ప్రార్థింపదొడంగిన రాజుంగాంచి ఓరాజా, ఇదేటివింత. యెంతపనికొడంబడితివి నాకొసంగిన ప్రమాణమునకు బదులేదైన నా కొసంగితివేని యూరకుండెదను లేక మగుడి నిన్నుగూడెదనని చెప్పిన నకామినింగాంచి నీకువలయువాటిది యెట్టిదైననునడుగుము యిప్పుడే నొసగెదనని చెప్పిన నది నాయభిప్రాయమునకు బమలుగా నీ కొమా రుని శిరస్సిచ్చితేగాని విడువను. అటుల నిచ్చితివేని నాప్రతిజ్ఞకు సరికట్టు

కొనియెకనని చెప్పినపల్కులు రాజు చెవులకు ములుకులై ఆహా ఇదెంత టినిర్దయురాలు, నాకుగల వాంఛ నొసఁడు. వాఁడు అతి నీతిమంతుఁడునై పరోపకార కారుణ్యాది సుగుణశీలుఁడు. అట్టివానిశిరము నెటులయివ్వఁగలవాఁడనని దిగులొంది ముఖముకంది చింతిలోఁగుంది యూరకుండెను.

దశమిమంటపమున రాజులందఱుఁ జేతెంచి పురోహితులు మించి గాయకులు వెలసించి వేదవిప్రులుమరు గడించి సంతసమందమందరై రుక్మాంగదమహారాజును యెదురుజూచిజూచి రాలేమిని ధర్మాంగదుఁడు అంతఃపురముచేరి తనతల్లినిజజనన్యమ్మ నాజ్ఞఁగనివీక్షించి కాలతామసమగుచున్నదని యెదురుజూచుచున్నవారలు గావున నీవుశీఘ్రమునచని మజ్జనకుఁడు రాని కారణము లరసిరమ్మా యమ్మాయని నమస్కరించిబలికిన పలుకులువిని నామగఁడుగుమ్మ నెమ్మదిగొన్న మనంబుతో సవతి యింటికేగి పతినింగాంచి యచ్చట జరిగినవృత్తాంతమెల్లవిని చింతలు గైకొని తనసవతింగని ఓయువతీపతి, యాటమాటగాదని తెలివిపొందిన నీతిమతీ నీకిదేమిటివమతి దుర్మదవతి సుమతివై వెలయుమని చెప్పిననంధ్యావళి పలుకులువిని నేనేమి యట్టిదురాకృతమైన కార్యములకు నొడంబడి వారి మాటలను జవదాటలేను. నాకిచ్చియున్నవరములను మచ్చికతో వేఁడితినిగాని మరేమిలేదు. యట్టివరమిప్పుడిచ్చుటకు పాలుమారి నామీఁద ఋణముబెట్టి మారాడకయున్నారు. వినుమమ్మా మును హరిశ్చంద్రుఁడు పుత్రునివిడచి భార్యను నొరులకొప్పగించి తా నరణ్యము విహరించి వీరబాహుకు వూడిగము లొనరించి పలుకష్టముల చెందిన కారణమేమి సత్యము నెడిశౌచము తప్పరాదనియు యిక్ష్వాకువంశమునకు గొరవము పోరాదనియు క్షత్రియులశౌర్యము విడువరాదనియు ఖ్యాతియగు ధ్వజము నేలపడరాదనియు వారలు చెప్పినమాట తప్పక జరిగిరి. అట్టి కులమున నవతరించినవారిటుల జరుగకయుండిరేని అపఖ్యాతిచెంది గౌరవహానిపొందియుందురు. ఇది వారికి తెలియపరచుమమ్మాయని మోహిని జెప్పిన వచనంబులువిని తన యంతఃపురముచేరెను.

అటులవచ్చిన తల్లింగాంచి నచ్చోటవృత్తాంతమెల్ల దెలిసితల్లితో పినతల్లి గృహమునకేతెంచి యామెకు నమస్కరించితండ్రికి వందనంబిడి అయ్యా, మన నెయ్యము విడువరాదయ్యా చయ్యన లెమ్ము నాశిరము

మని నాయింతిని కాళ్ళతోదన్ని, మొండిచేతులచేగొట్టుటయు, కన్నట్టు దిట్టుటయు మొదలగువిపరీతంబులను చేయుచున్న తనభర్తయందు రోయింపులేక నెపంబులెంచక సంతోషంబుమిన్నక విశేషపుపచర్యలందే లుచు విశ్వాసంబులు మించుచుయుండెను

ఇట్లుచేయుచున్న తనపత్నియగు నళినియనున్యంజూచి ఓసీ! నిర్భాగ్యురాలా! నీవెంత పాపివో నే నెరుగను నాశరీరంబుపతిపన్నెబంగారంబురీతి నుతికెక్కిన అందంబుతోడచిందులువేయుచున్నదిమానిరోగంబులుబలిసి ఇంద్రియవంబులుస్వాధీనంబుతప్పి నడలుమొండై అటుయిటు చనుటకశక్తుడై యేమియుండోచక జేసిన నీవివాహంబు యెంతావహంబు. ఓసీనికృష్టవతీ! నిన్నంటవచ్చినయారోగంబు యెల్లుపోవును. నేనేమి సేయుకును యూరకుండక నిన్నేలపెండ్లాడితిని. అయ్యోయిది నాగ్రహచారమా, నాకు బ్రహ్మయిట్లని వ్రాసియుండెనేమో నేనెరుగనైతినే యని పలువిధంబుగా దూషించుచున్న మగనికాళ్ళపైబడి నమస్కరించి అయ్యోస్వామి నేనేమిచేయగలను నావల్లనయినంతశరీరకష్టంబు చేయగలను వానివ్యాధినాన్పనగునా నన్ను మీరుయేవిధంబుగ బల్కినా యేమి చేసినామీకుగాని నాకు వేరెవరున్నారు? గావునతాముయెందుచేగ నిచ్ఛయున్నదో ఆయూచోట్ల త్రొప్పదగేని యేను భయభక్తిశ్రద్ధలతో అచ్చోటికెత్తుకపోయెదనని చెప్పిన మాటలువిని మనస్సున సంతసంబంది నాసుదతింగాంచి సౌభాగ్యురాలా! నీవు నన్నుయీఖండంబునంగల యెల్లపుణ్యతీర్థంబులు కెత్తుకపోయి అందు మజ్జనంబుగావించి తెమ్మని చెప్పినవిని అట్లే తనభర్తను భయంబుతో యెత్తి నెత్తిమీదయుంచుకొని రక్తంబులుగాగ చీములూలుక మాంసంబులుబడ దుర్గంధంబులు వీవ సీమ రోయింపులేక గొనిపోయెను. అట్లుపోగా చీకటిగ్రమ్మవచ్చెను అంత నొకపట్టణంబుగని అందునివసించిపోదమని ఆపురంబు జొచ్చి వూరేగి యున్నవారు పెచ్చినగనికిలిపించిమిగిలిన శేషాన్నంబు తానుభుజించిశయ్య చేర్చియున్నసమయంబున నాతడుఖిన్నుడై ముఖంబు వ్రేలవేసి జింతనొంది యున్నమగనింగాంచి ఓస్వామీ! తామేమి జింతగొనియున్నారు. నేచేసిన యపరాధమేమియువియడిగె. అందులకాతడు చిన్నదానా, నీవడిగినందున నేమిప్రయోజనంబు నాకోర్కెలీడేర్చపోయెదవాయని జెప్పినమాటలు

విని స్వామీ, నావల్లనయ్యెడు కార్యంబు యెంతకష్టమైనను నెరవేర్చెద ననాకనుజ్ఞ యివ్వండని వేడెను. నందుకాతఁడు ఓయింతీ, సేనాకార్యంబును నీతో చెప్పితినేని నీకు నన్నునకు చాలా కష్టంబుగలుగునని తలంచుచున్నాను అనిచెప్పగ స్వామీ, నాకు యిష్టమగు కార్యంబు యెవియో అవియెల్ల నాకున్ను యిష్టమగు కార్యంబులే తాముగుర్తెరింగిరా తమమన సుప్రకారంబు నేను నడుచుకొనెదను. కావున ఆజ్ఞ యివ్వండని వేడిన తనపత్నింగాంచి ఓయిల్లాలా, నేను నిరాతంకంబుగ జెప్పనోపుదునా అందు నీకు కాంక్షలునోపవే నామనసల్లజేసెదవా యిది నిజమేనా అని ముమ్మారు అడిగి తెలిసికొని తనపత్నింగాంచి ఓమదవతీ, ఈపట్టణంబున అతిరూప రేఖావిలాసవతియగు రంభయో; ఊర్వశియో; తిలోత్తమనో; హేమాంగియోయనునని చెప్పబడు సుందరాంగియగు యొకవేశ్యను గంటి దానిగన్నమొదలు మనసు నెమ్మదిలేక కామోద్రేకత మీరి తపించుచున్నవాడను ఓసఖీ, దానిసుఖము యెట్లునాకబ్బును దాని నాకెట్లు పొందనగూడ జేయబోయెదవనెను.

అంత నాయువతీరత్నంబు అట్లే కానిమ్మని కొంతతడవు యోచించి యేమియు యోచించక యిండ్లపనుల వృత్తాంతంబు ఎరయుచును మంచిదికానిమ్మని తాను హృదయాత్పూర్వంబున లేచి దంతశుద్ధిజేసి, తిలకంబుదిద్ది, నాభోగము దాసి యింటికిబోయి దానివాకిట కల్లాపుచల్లి ముగ్గులువైచి హృదయంబునను మనుపటివలె తనయింటనే యుండెను. ఇట్లు ప్రతిరోజున్ను అతి అలంకారమగుచిత్ర ముగ్గులుబెట్టుచు నుచ్చుచుండెను. యివిదాని పనికత్తెలుచూచి చిత్రముగ్గులు నిరీక్షించుచు తనసానియగు దాసితో తెలిపి యీబిడ్డను పట్టుటకు యత్నకర్తలై యుండిరి. ఒకనాడు యీబిడ్డ హృదయాత్పూర్వంబు నాదాసియింటికేగి పేడనీళ్లుచల్లి ముగ్గులచే అలంకరించున మయంబున నక్కరగుదాగియున్న దాసి దాసీజనంబులు వేగిరంబున బోయి తనయేలికయగు నాయికసానితో జెప్పిరి. అంత నాయింతి అతివేగంబున వచ్చి యాపతివ్రతాతిలకను గాంచి అమ్మా, నీవెవరు? యెందుండి యిందువచ్చెదవు? నిన్నుజూడ ఇంద్రాణివలెయున్నదే? నీవుచేయుకార్యంబులుచితంబులుగావే మాకిందులచే తెలియవలెరావే నీవు చేయుపనికై ఇంతటి అమానుష్యకృత్యంబులుగైకొంటివే నావల్లగు కార్యంబులేవే అదిచెప్పు

వేశ్యుని బహువిధంబుల వేడి నిలుచున్న దాసింగాంచి ఓఅమ్మా!సుందర
రూపవతీ! సర్వశృంగారవతీ! ఓయమ్మా నాకొకకోరికదీర్చెద
నని నిజంబుగ ప్రతిజ్ఞచేసిననే నామనంబునందుగల మొన్నిక విన్నవించె
దననిన నాయందుదయయుంచి [illegible] యమ్మా వేశ్యయని [illegible] ముల్లంఘించనని చెప్పె
ననుచు బాసచేయగా నానళిని దాసింగాంచి యోతల్లీ! నాభర్త అత్యంతవృద్ధ
డైనవాడు, చతుర్వేదపారాయణుడు, వేదాంతాభిసికుడు, సకలశాస్త్ర
నిపుణుడు,తపోబలుడు అట్టిమహాత్ముని వివాహంబుగొన్న నాకర్మవశం
బున నాతనికి పెద్దరోగంబుకల్గి శరీరంబుకృశించి యున్నవారు. అట్టివారు
నిన్నుజూచినీ మోహచిహ్నంబులలో దగిలి మిక్కిలి అన్నపానంబులేమా
లి నన్ను జేరి నీరాకగోరి యున్నవారు గావున నాకు పతిభిక్షమిచ్చి పతిమ
చ్చికదీర్చి ఆదరించుట నాకువలయు గొప్పవరంబు నాపతికిన్ని గతివేరులే
దు గావున అనాదరణ జేయక ఆదరించుమమ్మా యనివేడి నిలుచున్న నళి
నియను యింతింగాంచి అహా యి దేటిమాట యెంతఆశ్చర్యంబయ్యావిం
తయెందుంగానము ఇదేమో వింతంబగాయున్నది తపోమహిమగల సక
లసంపన్నుండగువానికి పెద్దరోగము వలంచించునా అట్లుండిన నాతనిభా
ర్యతో జెప్పిబంపునా నాతనికి కామోద్రేకంబున ఆశగలదా పరస్త్రీగమ
నంబుండునా జితేంద్రియులకదిన్యాయమా యిందేమో రహస్యంబున్న
దని దీర్ఘాలోచనజేసి ఓఅమ్మా! నీవు నీయిష్టప్రకారంబునిభర్తనుయిచ్చో
టికి దీసుకరమ్ము అట్లేగానిమ్మని చెప్పి బంపించెను. అంత నళిని శీఘ్రమున
తనచోటికివెళ్ళి తనభర్తను గంపలోనుంచుకొని తలమీద మోసుకొని నా
భోగముదాని యింటివాకిట దింపగానే నాముదుసలుడు తనభార్యగాంచి
ఓమదవతీ నీవువీధిలో నేయుండుము నేనునిన్ను బిలుచునపుడువచ్చి నన్ను
త్తుకొనిపొమ్మని సెలవిచ్చిన అట్లేనాయని తలవాకిటయునిలచిన యతం
డు మెల్లనజరిగి లోనికరిగి తలుపు మూసికొనిమన్మథునిదలచి వానిరూప
యుగైకొని నవమన్మథాకారుండై భోగముదానియింటిలోప్రవేశించెను.

అంతనాభోగముదియానుందరాకారునిజూచివిస్మయంబందిఆహా
ఇదేటి అందము యింపెందుగానని చందంబు యీతడుఇంద్రుడో,కుబేం
ద్రుడో, చంద్రుడో, అనిరుద్ధుడో, వెన్నుడో, మన్మథుడో, యనుకనులల్లా
ర్పక విస్మయంబంది అట్లునిలచి పట్టువదలక గట్టిగ నతని చేయిపట్టిలాగి

పానశయ్యనగృహంబున నింద్రభోగంబునకు సమమైన భోగావతంసంబ
గుహంసతల్పంబు శృంగారించి కీర్ణబాష్పులచే చామర సురటీలువీవ పల్లె
రంబున హారిశ్రీలు చెలఁగ తాంబూలంబునకర్పూరపేడంబులు మసుడింప
నిందుమందహాసవదనంబుతో నతనిశయ్యపై జేర్చి దృష్టితీసి ముద్దిడి కౌఁగ
లించి లాలించి అహా ఓరి మన్మధుఁడా నీకుట్టిరూప మిదివరలో నే నెందు
గానన్నైతిని నాయదృష్టఫలమున బలాత్కారమున నీయంతటి రూపవంతుని
పొందుచున్నాను నేనెంత పుణ్యంబు చేసితినో యనిపలికి నాదవ్యాప్తుగు
షుంగాంచి అయ్యో యింతటి తేజస్వియగు నిన్నుకుష్ఠరోగియగుబల్లసీభా
ర్యకుమనసెట్లువచ్చెను అయినను యింతటిజంగా నా చేతికొప్పించి దాని
మనసెల్ల నెమ్మదిఁ బచింపఁజేయుచున్నది దాని ప్రాణమున్న అది అనుభవించు
సుధామృతంబు నాచేతికొప్పగించి నన్ను తృప్తిపఱచిన ఆయింతికి నేనే
మిప్రతిచుపకారంబు చేయఁబోవుచున్నానని పలికి నయింతింజూచి మగునిచి
రునగవువవ్వి ఓశాలిరా వినిపించుచున్నజూచుచున్న యీరహస్యము
నుయెవరికి చెప్పవలదు నేనొక కారణమునుబట్టి యిట్టిరూపంబుల నా
భార్యకంటికిమాత్రమగుపడుచున్నానేగాని మరినేనులేను అట్లునీవు చెప్పి
తివేని నీతలసహస్రవక్కలగునని భయముజూపి నారాత్రంతయు దాని
గూడి మన్మథావేశంబుదీరి తెల్లవారగనే వాకిటవద్దచేరి మునుపటియ
ట్లముసలివాఁడై రోగంబుమీరి హీనధ్వనితో తలుపుదీసి భార్యనుపిలువ
గా నేస్వామీ యిదిగోవచ్చితి హాజరైయున్నానని అతి జాగ్రతగవచ్చి
భర్తనెత్తి గంపలోబెట్టుకొని నెత్తిన మోసి తనచోటికేగెను.

ఇట్లు పూరెల్ల దిరుగుచుయుండు దినంబులందు నొంకపురంబున
అధికారియును రాజు న్యాయాన్యాయంబుల గుర్తెరుఁగక కారణంబు
దెలియక విచారణలేక మాండవ్యమహాముని యను పుణ్యాత్ముని వుక్క
స్తంభమునారోపించి అందులో పీకినిదగిలించియుండిరి. వారు స్తంభమున
తగులుపడి ప్రాణముపోలేక యుండునప్పుడు యీపతివ్రతాశిఖామణి నా
పురముగుండా పోవుచున్నపుడు చీకటిక్రమ్మి పట్టంబుగ మేఘముగమ్మి
పురుషులు మెరుములతో వర్షించ మార్గంబు దెలియక నాపతివ్రతతలయం
దు గంపయుంచుకొనిపోవుచున్నపుడు వ్రేలాడుచున్న మాండవ్యమహా
మునిపాదంబులు యీబిడ్డ తలయందున్న గంపకుతగలగా నాలినికి స్తం

భయంబువల్లప్రదనంబు ఆధిక్యమాయెను అప్పుడు మాండవ్యుడు చూచి ఆహా యీయాంతి యెంతమతి గలదియనికోపించి తెల్లవారగానే నీప్రాణము తెగిపోగాకయని శపించెను. అదివిని యీబిడ్డనికులాంగి యీతను మహాత్ముడు కాబోలు మనము తెలియక చీకటిలో తత్తరబడి యీలాగు చేయనైతిమి మనయందేమియు తప్పిదంబులేకుండగా, ఇట్లుండ మనలనే ల శపించుటెను మంచిదికాదమ్మా నేను శుద్ధపతివ్రతనైతేని తెల్లవార రాదని ప్రతిశాపమిచ్చెను ఇట్లిరువురు జేసిన ప్రతిజ్ఞవల్ల యెనిమిదిరోజులు తెల్లవారక దిశలు తెలియక లోకమంతయు చీకటి క్రమ్మియుండుటను గన్న దేవతలు మొదలుగాగల సమస్తజనులందరు భీతిల్లి యిదియెందుకిటువచ్చెనని తెలిసి మాండవ్యులవద్దకొచ్చి స్వామీ యీఆపద తీర్పుండని వేడిన వారు నాయందేమియు నేరంబులేదు ఋషిపత్నివద్ద పొందవలసినవారు యీ పతివ్రతారత్నంబువద్ద జేరి అమ్మా త్రిమూర్తులు మొదలగు దేవతలందరున్ను దిశలు తెలియక తత్తరించెదము తెల్లవారునట్లు అనుజ్ఞ యివ్వవమ్మా యని వేడిననామె ఓయింద్రాదిప్రభువులారా, యిదేటిమాటలు నేనయి నా ప్రాణంబులుపోగొట్టుకొందును ఈన్యాయము మీరెరుగరాయన అమ్మా లోకంబున కొకరికి ఉపకారమైన యనేకులకు సుఖమయ్యెడు కార్యంబుచేయుటే న్యాయమని తెలియనే అందరునువచ్చియున్నారము గావునమ్మా నికరుణరావమ్మాయనివేడిన దేవతలంగాంచి ఓహో యిదేటిమాటయింతులకు పతికన్న దైవంబు యిలగలదే అట్టిపతినియెడబాసియుండుటకన్న జచ్చుట మంచిమతిగాదే నేను నాపతిని విడచియుండలేనని చెప్పినవిని దేవతలు మాండవ్యునిజూచి ఓస్వామీ తామైనను యీకష్టంబులను దేవతలగు మమ్ము కాపాడుమని వేడిన నాతడు నావల్లకానేరదు నాభార్యవలన కావలయుగాని మరెవరివలన కాజేరదనెను. దేవతలందరు గూడుకొని మాండవ్యుని వెంబడించుకొని మహాపతివ్రతయగు నళినీదేవినిందోడ్కొని మాండవ్యునిసమీపముజేరి యీయింతియు మంగళసూత్రంబు నిరతంబుండునని ఆశీర్వచనంబులు బల్కుమనివేడిరి పంత నామాండవ్యుడు మనసుకరిగి ఓయింతీ నీవు సుమంగలివై దీర్ఘాయువున వెలసిల్లుమని శాపంబునివర్తించెను అంత నాబిడ్డ మునుపటియట్లు వుదయాస్తమానంబులు గావుగాకయని విముక్తంబుజేసిన యంత తెల్లవారవచ్చెను, లోకులందరు దిశలు

తెలిసి తమతమ యోగయాగ హోమాది తర్పణంబులుచేసి సంధ్యలు మార్చిరి

అంత నమ్మౌద్గల్యమహాముని తనసుందరియగునళినీదేవింగాంచి ఓసీ యింతీ నీయంతటిపతివ్రత భక్తిశీలయగు యింతి నెందుంగాన నీకు గల కష్టంబులనియు దలంపక యోర్చి యున్న యోర్పు యెంత వెల గలదు గావున నేను నీయిచ్ఛ నెరవేర్చెదను నేను కుష్ఠురోగిని గాను ముసలివాడనుగాను నీకోరికె దెలుపుమన నాయింతి నంతసించి ఓస్వామీ తాము నాయందు ప్రీతియుంచి ఐదురూపంబులగల నన్ను గూడి మరు కేళిసాడి సొంపులుమగుదుండవలయు యిదియుగాక నాకు మరుజన్మ మొచ్చెనేని తామే భర్తకావలయు యిదినాయభిప్రాయం బని వరంబులంది సుఖంబున పలుసంవత్సరంబులు సుఖం బనుభవించు చుండి దంపతు లిరువురు వైకుంఠపదవులందిరి. గావున యింతులు లోకంబున నళినీదేవి యుండిన పతివ్రతయు శుచియుశీలంబును భద్రంబును సత్యశౌచంబులుగలిగి ఖ్యాతులుకొంది పతివ్రతలని మెప్పించి మోక్షార్థమగు కార్యంబులుచేయుచు పతిభక్తిగలిగి మగడేదైవమనినమ్మి జరుగవలయునని యీపుణ్యకథవలన తెలియుచున్నది సకలార్థకము.

నళినీదేవిప్రభావము – ముగిసెను.







శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## ౧౨. లోపాముద్రాదేవి ప్రభావము.

పూర్వకాలంబున విదర్భదేశాధీశ్వరు పుత్రికయగు లోపాముద్ర యనుకన్యక మిక్కిలి చక్కనిదియు, సుగుణంబున కాటపట్టయినదియు మిక్కిలి శాంతిశమకంబులు గలదియు భూతదయాపశ్చాత్తాపంబు గలదియు నీతిశాస్త్రవిశారదియు, ధర్మశాస్త్రవిచారణియు, వేదవేదాంతార్థగోచరయునై యంతఃపురంబుననుండి పెద్దలవలన పతివ్రతాస్త్రీల ప్రభావంబు వినుచు తోడిచెలికత్తెలతో సత్కథావిశేషంబుల ప్రొద్దుపుచ్చుచుండెను.

ఇట్లుండగా నొకనాడా రాజసభకు కుంభసంభవుండగు అగస్త్య మహాముని వచ్చె. రాగా జూచి ప్రభువు సింహాసనము పైనుండి దిగి యెదురేగి యమ్మునీంద్రోత్తముని వచ్చి యుచితపీఠంబు పైగూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాది విధులం బూజించి కుశలంబడిగి మునికులచంద్రా! మీదర్శనంబున యీ దినము సుదినంబయ్యె. మాకు జన్మపావనంబయ్యె. మా పాపంబు నశించె. మీరిచ్చటికి వచ్చిన కార్యంబెట్టిదో నాకెరుంగింపుడు మా చేత సాధ్యమైనంత మట్టుకు మీ మనోద్దేశంబు నెరవేర్చెదనని పలికె. పలుకగా నా మునీంద్రుండు భూపాలా! నీవు సత్యవ్రతుండవనియు మిక్కిలియుదారగుణములు గలవాడవనియు విని నిన్ను నేనొక్క విషయమును యాచింపవచ్చితిని నీవన్నమాట తప్పవలదు, అదేమనగా, నాపితృదేవతలు లొక్కదినము ప్రత్యక్షంబై అన్నా నీవిట్లు అనేకదినంబులనుండి వివాహము నొల్ల బ్రహ్మచర్యాశ్రమమునం దేయుండుటవలన మాకుం బుణ్యలోకంబు గలుగకున్నది 'అపుత్రస్యగతిర్నాస్తి' యను వేదవాక్యము ప్రకారము పుత్రులు లేనివారికి సద్గతి గలుగ నేరదు. వంశము లవిచ్ఛిన్నముగా నేడవతరమునందు బుత్రుడు పుట్టినిదిగాని మొదటితరము పురుషునికి పుణ్యలోకము కలుగదు. నీవు మా యేడవతరము వాడవు కావున వివాహంబొనర్చికొని

మమ్ముద్ధరింపుమని దీవించి యదృశ్యులైరి. అందుకై నేను వివాహంబు గావించికొని గృహస్థధర్మంబున నుండఁగోరి నీకూతు నడుగ వచ్చితి గనుక దానినిచ్చి పెండ్లిచేసివేసిన గొప్ప సుకృతంబు గలుగునని పలికె. పలుకగానే అట్టి మాటలా రాజు చెవులకు శూలంబులవోలె నాటి మూర్ఛాక్రాంతుడై భూమిం బడియె నంత మంత్రులు సామంతరాజులు నతనిమూర్ఛం దొలంగునటుల శైత్యోపచారంబు లొనర్చి పల్లకిలో నెత్తికూర్చుండబెట్టి అంతఃపురమునకుం గొనిపోయిరి.

పిమ్మట నా రాజేంద్రుఁడు మూర్ఛందేరి యాశ్చర్యపడి వింటిరా మంత్రి ప్రధానులారా! నిరుపేదయు వనవాసియు జడదాల్పరియు నొక్కలికృశీభూతుండును గు యీబక్కబాపడెక్కడ? నాముద్దుల బిడ్డ యెక్కడ? నక్క యెక్కడ? నాగలోక మెక్కడ యన్నట్లు యాలోచి బాపడటనా కూతురట పెండ్లిచేయుడనుట బాగు బాగు కొంచమైన తారతమ్యముంగానక యిట్టి వెంగలికూతంగూసె యిట్టివానికి సన్యాసినియేమిచేయవచ్చునని మిక్కిలి కోపోద్దీపితమానసుండై వేగెలుగెత్తి పలికె. ఇట్లు పలుకగా నారాజును జూచి నరేంద్రా, మీకిట్టి కోపంబును కర్కశ్యంబగు వాక్యంబుండగవు.

అతంకు వేతన్మాత్రుడై నవావే; ఆట్టిమునీంద్రుని దివ్యప్రభావంబును జెప్పెదము వినుండు. ఇంద్రద్యుమ్నమహారాజును గదగజంబుగాబుట్టునట్లు శపియించె సముద్రములోనినీటినంతయు యరచేతిలో నెత్తెచ్చి గుటుక్కునద్రావెను వింధ్యపర్వతముయొక్క గర్వమును జెపి సూర్యచంద్రులకు స్వేచ్ఛనసంచారము గలిగించె పాతాళానికి పుట్టెడుబుద్ధులన్నట్లు యింత గలిగినేని ముల్లోకంబులుగడగడవణకును. అట్టిమహామునినింత చులకనంబుగా పలుకం బాడిగాదని పలికెను ఇట్లుండగా యీవర్తమానమును రాజపుత్రికయగు లోపాముద్ర విని యపారంబగు భయంబున సంతోషంబునుం బొంది తత్కాలంబున తండ్రివద్దకు వచ్చి ఆతనికి నమస్కారంబుగావించి నతని తొడలపైగూర్చుండి యాతనివలన నప్పుడు వృత్తాంతంబంతయు సవిస్తరంబుగా వినిఆ వెనుక తండ్రీ, మనపూర్వజన్మమున జేసిననశేంబునమ్మహామునిం బ్రార్థింపకయే మనగృహంబునకు వచ్చె ఇతండు సామాన్యుఁడు గాఁడు పరమతపోధనుఁడు. యిట్టిమహానీయుండలిగెనేని మనకు బుట్టగతులు గలుగదు. తనకు తానే కన్యార్థియై మనసదనంబునకు వచ్చెగావున నతనికి

వన్నిచ్చి వివాహంబొనర్పుము సప్తసంతానంబులు ధరించుటయేగాక మ
నకు ఐహికాముష్మిక ఫలప్రాప్తియుం గల్గు నీవు మొదటి యెట్టి కార్యము
నైనం జేతునంటివి ఆడినమాట తప్పితివేని మహాఘోర నరకంబునం బడుట
యేగాక ఇతండలిగి శపించెనేని మనవంశంబు నిర్మూలంబగు కావున నిట్టి
సత్పాత్రునికిచ్చి పెండ్లి చేయుటకు చింతింపవలదని చెప్పెను. చెప్పగా అమ్మా
నీవెన్నడు నిట్టి యజ్ఞానంబడవు ఇట్టి వికారస్వరూపుండగు బనుగుబాపన
సన్యాసిని భాగా తలచితివే తల్లీ. యితడేనా నీకుమరియెవ్వడుం జిక్కడా
యమ్మా యితనిక్కైపై యాశ విడువుము నిమనంబునకింపగు చక్కని వరునిం దె
చ్చెదమాతము అని పలుకగా నాలోపాముద్ర తండ్రీ! సనాతన యితి
హాసంబుకలదు తొల్లి యువనాశ్వుని మాంధాత్రు మహారాజు పొద్దకు సౌబరియను మహా
మునీంద్రుం డరుగుదెంచి యారాజపుత్రికలలో నొకదానిని తనకిచ్చి వివా
హముగావించునట్లు వేడె నంత నాభూపాలుండు ముసలివాని చింతాక్రాం
తుండై మునీంద్రా! నాకన్యారత్నంబులు స్వయంవరంబులు వారిలో నెవ్వతెైన
నిన్ను వరించునేని యాపుత్రికనిచ్చి వివాహంబొనర్చెద వరింపకేని విధి
దదృష్టమని తలంచెదమని నుడివె అంత నాజడదారి యుంగుడి సమ్మతించి
యాక్షణంబున నంతఃపురంబునకుం జని యచ్చటి కన్యకారత్నంబుల గను
లారంజూచె నప్పుడా కన్యకామణులు లేబనుసు చెనుచుక సమ్మనంబే నీయునివరించుటచే
మాంధాత తనయభిప్రాయ మేమియుం గొనసాగకుండుటకునగచి యా
పుత్రికారత్నంబుల లేబనుసుననాయుపిక నిచ్చి వివాహంబొనర్చెనని పెద్ద
లవలన వింటిని గావున నేనతనిం దప్పమతికొకక్క డెట్టిమన్మథుండైన
వాని నొల్లనని దృఢచిత్తంబున బలుకగా తత్క్షణంబున యా రాజేం
ద్రుం డమ్మహామునికి పుత్రికనొసనిచ్చి పాణిగ్రహణం బొనర్చె.

ఆ వెనుక నగస్త్యమహర్షి సుగుణంబులు కాటపట్టగు భాగ్యంబుచూచి
మిగుల సంతోషంబునుం బొంది ఆ కుమారి సముల పర్యంతము నత్తవారిం
టనుండెను. లోపాముద్రాదేవియు పెండ్లియైనది మొదలు తనమగని
భగవంతుని సమానముగా నెంచి పూజించుచు విధి శ్రీమహాలుంగా విం
చుచు శరీరపోషణంబునందైనను వస్త్రాభరణములు మొదలగు నలం
కారమునందైనను యుపేక్షించెట్టక యితని గడ్డమాటలాడక సర్వకాల
సర్వావస్థలయందును భర్తృపదారవింద చింతాతత్పరురాలై యుండె.

యుచితపీఠంబులం గూర్చుండ బెట్టిరి అంత నావిషులాంగి లోపాముద్రం జూచి యాపుణ్యవతి "తేనెలమ్మ లేవ సనాథురాలగా కలిగినమ్మను అనుభవించు టకేమిచేయు" "1. నెలనెల గుసంపద కలిగియు | నెల నెల బాగుగు సంగ కట్టని నేర నినానుజూ | దట్టి మూటి చేసి కిగట్టిన | నెలబాస్త్రము కాను మొన్ని విధముల జూడక" అన్నట్లు శాంబల్రేష్టునికు ఘనరవై అవమానంబులగు భోగభాగ్యంబులుగలిగియుండియు హాటకొల్లక దివ్యవస్త్రాభరణ ధనకనకవస్తు వాహనాదుల మరలనాకిచ్చియిట్లనాగచీరలంగట్టి యలంకారహీనురాలై యుండెను. నాభోటినాక లెవ్వరైన వస్త్రాభరణంబులనిమ్మనియడిగె రేని నాకేమి చ్చెదవులనిపల్లె కల్లగా నేనాయమ్మ అయ్యోతల్లీ నేనుసంసార రహీనురాలై యున్నను మీవంటి పుణ్యాత్ములకృపాకటాక్షంబున నమూల్యవివిధ వస్త్రాభరణంబులు గలిగియుండుదాన మీ కెద్దియిష్టంబగు వాటినికోరుము నేని యిచ్చెదననిపలికె నంతనావిషులాంగి పుణ్యవతీ నామ్ములనెల్ల నాకిమ్మనియడిగె నడిగినమాత్రంబున తల్లీ, యిదుగో యీ చెట్టుకొమ్మల నాకున్న సొమ్ములనెల్లదవిలించియుండెద రారమ్ము పుచ్చుకొమ్మని యొక్క చెట్టుంజూపనంత నావిషులాంగి సర్వాభరణాభరితయగు నావృక్షముం జూచి యబ్బురపడ యాపరమపతివ్రతాశిరోమణి ననేక విధంబులం బొగడి భర్తలం గూడి తన యాశ్రమంబునకుం జనె.

కావున సత్యభామా, సవికనైన నిజేశ్వరుని ప్రాణేశ్వరునిగా దలచి పలువిధములగు శుశ్రూషలచే నతనిమనసు మెప్పించి యతని మాటకెదురాడక మృదుమధుర హిత సల్లాపంబుల తనని కి ప్రియంబుగావించుచుండు వేనిపునరావృత్తరహితంబగు శాశ్వతబ్రహ్మానందపదవి నీముంగొంగున ముడిచిన బంగారముపంటిదగు లోకులచే సత్కీర్తింబడసి యిహపరలోక సుఖంబులనొక్కింతయు గొదవలేక యనుభవింపగలదానవు అనిపలికె.

గావున యింతులు లోకమున లోపాముద్రయుండినపతివ్రతయు శుచియు శీలమును భద్రమును సత్యశౌచములు గలిగి ఖ్యాతులు శొంది పతివ్రతలని మెప్పించి మోక్షార్థమగు కార్యములు జేయుచు పతిభక్తి గలిగి మగడే దైవమనినమ్మి జరుగవలయునని యీపుణ్యకథవలన దెలియుచున్నది సకలసార్థకము.

లోపాముద్రాదేవి ప్రభావము — ముగిసెను.



శ్రీ ర స్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీ భ క్త వి జ య ము.



## ౧౩. సావిత్రీ దేవి ప్రభావము.

అనేక యుగంబుల క్రిందట మద్రదేశమును పరిపాలించుచుండిన సాళ్వపతియను నొక్క రాజు కలఁడు అతనికి అశ్వపతియని మఱియొక పేరుం గలదు. అతనికి భార్య మాళవి, అట్టి సాళ్వరాజు అనేక దినంబులనుండి బిడ్డలు లేక చింతాక్రాంతుండై 'అపుత్రస్య గతిర్నాస్తి' అను శ్రుతివచనప్రకారము పుత్రులు లేనివారికి గతులు లేవుగదా! ఈశ్వరాయని దలంచి యొకనాఁడు మాళవీ సహితుండై వనంబునకుం జని సురాసురులకాశ్రయంబగు దృఢమనస్కులై సావిత్రీదేవింగూర్చి తపంబు గావింపగా నా దేవి వారలనిశ్చలితోగ్రతపంబునకు మెచ్చి సంతసించి యోదంపతులారా! మీరిట్లు నిరాహారులై రాత్రింబగలనక యెండవానలకు నోడక తపంబొనర్చుటకు గారణంబేమి యెఱింగింపుఁడని పల్క, నంతవారలా దేవింగని నమస్కరించి పలువిధంబులం బొగడి తల్లీ! మేమనేకదినంబులనుండి యనపత్యులై యుండుటంబట్టి నిన్నుఁ గూర్చి యట్టి తపంబు గావించెదము. కులశ్రేష్ఠుండును సత్యసంధుండును నగు నొక్క కుమారుని మాకుం దయసేయుము వే. యని వేడిరి వేడగా నా దేవి వారలం గని యో పుణ్యాత్ములారా! తొల్లియే మీకు పుత్రసంపత్తి లేకుండునట్లు బ్రహ్మదేవునిచే విధియింపంబడియుండ మీకెట్లు పుత్రవరంబిత్తు. కావున మీకు త్రిలోకసుందరియు శాంతశమదమాదిగుణప్రధానియు పతివ్రతాశిరోమణియు నగు నొక్క పుత్రికారత్నంబు గలుగునటుల వరంబిచ్చితి. అట్టి పుత్రిక పాతివ్రత్యప్రభావంబున మీకు నూర్వురు కుమారులు బుట్టెదరని యానతిచ్చి యాసావిత్రీ యదృశ్యంబయ్యె. నంత కొన్నిదినంబులకు వెనుక మాళవీదేవి గర్భంబు దాల్చి సావిత్రీదేవిం గనియె.

అంతనప్పుత్రి సావిత్రీవరంబునం గలుగుటంజేసి యాశిశువునకు సావిత్రియని పేరిడిరి. సావిత్రి దేవి తలిదండ్రులకు ముద్దుచూపుచు సుకుమారియై జాబిల్లికళలంబోలె మనోహరంబుగ బెరుగుచు చిరుప్రాయంబుననుండి సుగుణంబు కాటపట్టగుచునుమెలంగుచుండ నబ్బాలికామణి యవ్వనంబుపొడసూప నంత నారాజపుత్రికామణి యావనారూఢయై యుండుటకు మిక్కిలిచింతించి యీశ్వరా అతిగారాబముతో నల్లారిముద్దుగా బెంచిన యీ నాబిడ్డకు తగినవరు నెవ్వ డెత్తునని డోలాయమానసుండై యుండగా నట్టి సమయంబున మునిశ్రేష్ఠుండగు నారదుం డారాజుకడకరుదెంచి యతనిచే యర్ఘ్యపాద్యాది విధులంబూజలంది ఓ రాజా! యౌవనంబుమీరిన నీబాలామణిని తగినవరునకిచ్చి వివాహం బొనర్చిన సమయంబున సావిత్రియల్లనవచ్చి ప్రేమాతిశయంబులగు ముద్దులుచూపుచు తండ్రితోడనప్పై గారాబంబున గూర్చుండె అట్లు కూర్చుండియున్న కుమార్తెంజూచి యల్లనతడవి శిరంబుమూర్కొనినాయమ్మా! నాబిడ్డా! నీకిక వివాహకాలం బాసన్నంబయ్యె లోకంబునంగల రాజశ్రేష్ఠులలో నేరాజపుత్రునివరింతుమట నీకభిమతంబు జెప్పుము యాతనింబుననట్టివాడింద్రుండైనం దెచ్చి నీకు పెండ్లిచేసెద జెప్పవే నాతల్లీ అనిఅడిగె అప్పుడారాజపుత్రి తనదాసీజనంబుచే సత్యవంతుండను రాజపుత్రునివృత్తాంతంబును సాకల్యంబుగావినియుండె.

గావున తండ్రింజూచి నాయనా! సాళ్వ దేశాధిపతియగు ద్యుమత్సేన మహారాజు దైవయోగంబున రాజ్య విభవాతిశయంబుల నోడియంధుండై దారాపుత్రసహితంబుగ పుణ్యారణ్యాతనంబున దినగూడును గట్టగుడ్డయులేక కందమూలఫలంబుం దినుచు మిక్కిలి గష్టపడుచుండె అట్టిరాజశ్రేష్ఠునకు వయోరూపవిద్యామనోహరుండును సుగుణాలంకృతుండును సత్యభాషణుండును చిత్రాశ్వుండను నొకకుమారశ్రేష్ఠుండు గలడు. అట్టి చిత్రాశ్వుండు తనయావనప్రాయంబుననుండి సూనృతావ్రతానుష్టానంబు గలవాడగుటవలన నతనిసత్యవంతుండను పేర లోకంబంతయు వాడుకగనుక తండ్రీ! నేనట్టియుత్తమవ్రతుండగుసత్యవంతునే వరింతు మఱియెట్టిగుణాతిశయుండైన సమన్మథుండైన నేనట్టివానివరింపననిపలికె. అంత నారాజు మునీంద్రుంజూచి స్వామీ! మీదివ్యదృష్టి

వలన త్రిలోకంబులంగలవృత్తాంతంబులెల్ల మీకుకరతలామలకంబులై వెలయుచుండుటయేగాక నిమిషమాత్రంబైన నలకం దీర్చుకొన బ్రొద్దులేక అహోరాత్రంబులు త్రిలోకసంచారంబు చేయుచుండు మహానీయుండగుటవలన మునీంద్రా! ఆసత్యవంతునివృత్తాంతంబును విస్తరంబుగా నాకానతిమ్మనివేడె. నంత కలహాశనుండారాజుం జూచి నరేంద్రా! వినుము. సత్యవంతుడు పరిణయంబైన యొకసంవత్సరములోన మృతిబొందునది నిశ్చయంబుసుమాయనిపలికె. పలుకగా నతండాకూతుంజూచినాముద్దులగుమ్మా! నాబంగరుబొమ్మా! నానోముపంటా అయ్యో! అతండల్పాయువు కడుదరిద్రుడు. వనంబులం గష్టింపబడుచుండువాడు. కావున నాతల్లీ యట్టివాని గోరందగదు సకలగుణోపేతుండగు మఱియొకని గోరుమనిపలికె.

పలుకగా నాయమ్మతండ్రీ! మనోవాక్కాయకర్మంబులనుసిమాట మనంబేప్రధానమగుటవలనఅట్టిమనసున తొల్లియే నేనతనివలచి యుంటి తివాడెట్టివాడైనం గొఱతలేనే కావున నేనట్టివానింగాక మఱియొకని పెండ్లియాడనని రాజశ్రేష్ఠునకనిపల్కె. అంత నాభూపాలునకు రాచకులంబునంబుట్టు రాజస్త్రీలకు తొల్లియే నలుమోమునలువ వ్రాయుంపగను వ్యాజం బొకటిగల్పించె. అట్లు తమకు తామేపురుషుని వరింతురుగాకయను విధిలేకుండిన సర్వశుభలక్షణోపేతుండగు వరుంగూర్చి మహోత్సవంబుగ పెండ్లిసేయుగ నిచ్చగదా యాయశ్వరాయుని చింతించి తత్క్షణంబునదృఢమనస్కుండై కొన్నిదినంబులకు పెనుక నారాజశేఖరుండురథగజతురగపదాతులను చతురంగబలములతోడను ధనకనకవస్తువాహనంబులతోడను అమూల్యంబులగు నవమణిమయ భూషణాంబరములతోడను, దాసదాసీజనంబులతోడను, శోభనద్రవ్యంబులతోడను, మంగళవాద్యవిశేషంబులతోడను భూరికాహళభేరీభాంకారాది ధ్వనులతోడను మిన్నుపిక్కటిల్ల సకలబంధుపురోహితవిద్వజ్జనగాయక పాఠకవందిమాగధులతోడను, పత్నితోడ్కొని సావిత్రీసహితుడై యొకనాడు శుభముహూర్తంబునందలి పుణ్యారంబునకుం జని సాళ్వదేశ భూపాలుండగు అశ్వపతింగని నమస్కరించి కుశలమోదంబులనడిగి నరేంద్రా! యీకన్యకారత్నంబు నాపుత్రిక. దీని నీ కుమారుండగు చిత్రా

రున కిచ్చి వివాహంబు సేయదలంచివచ్చితి. నరేంద్రా! నీయుద్దేశం బెట్టిదో యానతిండనిన బల్కె. పలుకగా సాళ్వరాజు జనపాలా! రాజ్యవిభవంబులం బాసి యిట్లడవులం గడునిడుమలంబడుచు, ఉపవాసంబులచే స్రుక్కుచు, వస్త్రహీనులమైయుండు మాబోటిదరిద్రులతో వియ్యమందుటకంటె భూమండలంబున మఱెవ్వరు మీకు లేరే! మఱియు నవమణిమయ విరాజితంబులగు సౌధంబులం దంతఃపురవాసులై యమృతోపమానంబులగు పదార్థంబులం గుడిచి యమూల్యవస్త్రాభరణంబులం దాల్చి బంధుసఖీజనంబులతోడ సుఖంబుగనుండు రాచకన్నియ మాబోటికింగూర్చిన సహించి మాతోడం గలసి మెలసియుండునే యిదేటిమాట నీవెఱుంగని ధర్మముం గలదేయని మద్రపతికెఱింగించె. అంతట నమ్మద్రపతిసాళ్వపతిం జూచి భూపాలా, కలిమిలేములు కావడి కుండవంటివి కావున యిప్పుడు మీపడు బాములు తిరంబులై యుండునని తలపకుము యిట్టిశోభనోద్యోగంబున కియ్యకొనుండని ప్రియవచనంబుల నాతని మోదింపంజేసి యొక్కనాడు శుభముహూర్తంబున సత్యవంతుండను చిత్రాశ్వనకుం దన కూర్మిపుత్రియగు సావిత్రీదేవినిచ్చి వివాహంబొనర్చి కొన్నిదినంబు లచ్చటనుండి యాతంటనామద్రరాజు సన్మానితుడై స్వదేశంబునకుం జనియెను.

అంత నా సావిత్రీదేవి వివాహంబైనది మొదలు ప్రతిదినము పతికి మున్న లేచి జలంబులాడి శ్రీగంధమడపుఁబెట్టి యింటంగల పనుల నెల్లం దీర్చి పతిచరణారవిందంబులకు మ్రొక్కి పతియే దైవంబని భావించి వివిధోపచారంబుల సతతము మనంబునకు బ్రియంబు పుట్టించుచు రాత్రింబగలు భర్తృపదారవింద ధ్యానంబున నే ప్రొద్దుపుచ్చుచు ఆశ్యడం గలుగు మునివరాంగనలారాయమనం బతివ్రతాశిఖామణియై వెలసె. అటులొక్క సంవత్సరకాలమువఱకు సతీపతులు నీరుపాలుం గలసిన చందంబున గలసిమెలసి సరససల్లాపంబులనుండు నెడ నప్పరమపతివ్రతయగు సావిత్రీదేవి వివాహంబైన మొదలొక సంవత్సరమునకంతయు దన ప్రాణేశ్వరుండగు చిత్రాశ్వుండు నిలుగునని తొల్లి తనతండ్రికి నారదుండు చెప్పుచుండ దానును వినుచుండె

కావున నావాక్యము మదిం బెట్టి పెండ్లిదినము మొదలు వరుసగా నెన్నుచు నాదినంబునకు నాల్గవ దినంబున పతిమరణంబు దెలిసికొని యాదివ

త్రోత్సవంబుగఁ జూపుచు, అల్లనల్లన నవ్వనంబంతయుఁ గలయం గ్రుమ్మరి
యంతఁ బ్రియంబగు ఫలంబులం బూవులం గోసి పుటికలం బెట్టి యింధన
మ్ములకొరకై యొక్క యెండినమ్రానిం గని చేగరిడియుఁ జేగరిడియచే దా
నిం గొట్టి చీల్చుచుండె. అట్లు కొంతసేపు విదళనంబు సేయుచుండి బడలిన
చేతనుండు పరసునుం దటాలునఁ గ్రిందఁ బాఱవైచి యల్లనమ్రాని పైనుండి
దిగి గడగడ వణఁకుచు అయ్యో ప్రాణేశ్వరీ నాయొడలెల్ల మిక్కిలి బరువై
తోఁచుచున్నవి కాళ్ళుం దడఁబడసాగె తలయు నొవ్వందొడఁగె నడుము నిలు
వదయ్యె నేనేమి సేతు, యీవనంబున కేటికి వచ్చితి, నయ్యో నేనిన్నఁడు
నిట్టిబాధపడి యెఱుఁగనె యీశ్వరా యని తటాలున భూమిపయిం బడఁబో
యె. నట్టియెడ సావిత్రీదేవి ప్రాణనాథుం బట్టి కూర్చుండి యతని శిరం
బును తనతొడలపై నిడుకొని ప్రాణేశ్వరా, భయపడకుము కొంతప్రొద్దు
నిద్రించితివేని బడలిక దీఱి సుఖంబుగ నుండును. అని ప్రియవచనంబుల
నతని నిద్రపుచ్చె, అట్లతండు నొడలెఱుంగక నిద్రబోవుచుండ సావిత్రీ
దేవి దేవుని చేతయు, సూర్యుం డస్తమించుటయు, ప్రాణేశ్వరు మరణం
బునుం దలచి తలచి హా దైవమా, నన్నిట్లు చేసితివా, ప్రాణనాథా, నన్ను
విడచిపోయితి అని పొరలుచుఁ గుమిలి నేడువఁదొడఁగె

అట్టియెడ దండధరుండగు యముండు కాలపాశంబులం గొని గర్భ
నిర్భేదంబులగు రూపులతో పండ్లు పటపటం గొఱుకుచు శూలంబులం
దేబూని ద్రిప్పుచు నచ్చటికి వచ్చి నిలచె. అట్లు నిలచియున్న ధర్మరాజుం
గని భయము జెందియు ధైర్యంబు విడక దేవా, నీవెవ్వండవు భూతమో,
ప్రేతమో, పిశాచమో, లేక నెట్టివాఁడవో నాకెఱిగింపుమని పలికె.
పలుకునంతనతండా పతివ్రతం గని తల్లీ, కాలయముండ, సూర్యునిపుత్రుడ,
జీవులకెల్లం బ్రాణాంతంబు నొదించుచు దక్షిణదిక్కు నేలువాఁడ నగుట
వలన నితని కాలపాశంబులం గట్టి నాపురంబునకుం గొనిపోవ వచ్చితినని
వానిలో జీవుని బట్టి కట్టుకొనిపోయెను. అట్టిసమయంబున నాపతివ్రత య
తని వెన్నంటి చనుచుండె. నంతనతఁడామగువం జూచి తల్లీ, నీవేల యిటు
నాతోటి వచ్చెదవు. రాదగదిక నిలువుము నేబోవుమార్గంబిక నీకదృశ్యం
బు పొమ్ము పొమ్ము అని పలికె. పలుకగా దేవా, మీవంటి మహాత్ముల దర్శ
నంబు చేసిన సతులకు అదృశ్యంబగు మార్గంబు నొకటికలదే యని పల్కె.

అంతట యముండు పతివ్రతాశిరోమణి ప్రియవాక్యంబులకేసం తోషించితి నీవు వేగిరము పతివినా యేదైననొక్క వరంబడుగుము యిచ్చెదననియె. అంతనానారీమణి దేవా, నామామసాళ్వప్రభుండు కనుగానక వసింపబడియుండువాడు కావున అతనికన్నులు వెలియునటుల వరంబు ననుగ్రహింపుమని వేడగా అట్లే వరంబిచ్చితినని పల్కి నిలువక పోవుచుండె. ఆవరంబందియుంగల సావిత్రీదేవి వానితోడం గొంతదూరంబునచనగా తల్లీ, యేల మరలవచ్చెద విక నిలువుము అనిపలికె పల్కగా ప్రేతప్రభో మిమ్ముబోటియెరుకంగల మహాత్ములు మనోవాక్కాయకర్మంబులనెరింగి హింసచేయం బూనరు పరుల మనోభీష్టంబుల నెరవేర్తురు. అంతియకాక దేవా ధర్మమార్గానువర్తి అగుటవలన ధర్మదేవతఅనియు ప్రాణుల నియమించువాడగుటచేసి యముండనియు పేరొక్కంటివి కావుననీవెరుంగని కార్యంబొక్కటియుంగలదే అని పలువిధంబుల ప్రార్థించుచుండె. అట్లుండు వనితారత్నముంగని అతండో పతివ్రతామణీ మిక్కిలియాకటం డస్సినవానికి నన్నంబిడిన నాడెట్లు సంతోషించునో అట్లు నీమృదుమధురామృతవాక్యంబులనుగనిచె గావున నాయిందుముఖీ మరినెద్దిఅనిన నీపతివినాయొక్క వరంబు వేడుము యిచ్చెదననిఅనగా దండధరా తొల్లి మామామ పగతులచేనోటువడిన రాజ్యవిభవంబును మరలబొందునట్లవేడె. వేడగా నతండిచ్చితిననియె. అంత నాయిందుముఖి అట్టివరంబులు రెండుంగని వెండియు వైవస్వతు దోడంజనునెడం జూచి భామా, నీవేల మరలనావెన్నంటివచ్చెదవు దుర్గమంబును మిక్కిలిభయంకరంబునగు మార్గమును దాపయ్యె. యికరావలదు నిలువుము అనిపల్కె. పలుకునంత శమనా ధర్మచరితులు తా మునర్చు ధర్మక్రియలం దేజంబును మోహంబును విడువంగగుదురుగాక అని ధర్మంబువిడువనగునే వృత్తమస్త్రీలకు ప్రాణముకంటె దీపగు భర్తృపదారపూజంబె పునరావృత్తి రహితశాశ్వత పరబ్రహ్మానంద సుఖంబుననుభవింప నాధారము అట్టినా ప్రాణేశ్వరు నీవు కట్టుకొనిపోవ నయ్యో నామనంబెటులోర్చు నీవెరుంగని నీతియుంగలదే అనిపలికె

అట్టులను నారీమణింగని యోకమలముఖీ, యాహా నీధర్మవా

క్యంబులకును పతి వచనంబులకును నా మనంబు బ్రహ్మానందం బయ్యె కావున గుణాభూమణీ, నీపతివినా యొక్కవరం బెట్టిదైనను గోరుమని చెప్పెను. చెప్పగా యమునాసహోదరా, నాతండ్రియగు మద్రభూవసునకు నూర్వురుపుత్రులు బుట్టునటుల వరంబిమ్మనివేడె. వేడగా నట్టివరంబు నిచ్చితినని పోవుచుండె.

అంత సాశీల అట్టివరంబునుం బడసి వెండియు నాతని వెనువెంట బోవసాగె. అట్లువిడునక తనవెంటవచ్చుచుండుదానింగని వనితా అలవిగాని యిమ్మార్గంబున నీవలె నింతదూర మెక్క రాగు. నీపాతివ్రత్యప్రభావం బెట్టిదో యెరుగ మిక్కిలి బడలితివి. తల్లీ యిక నైన నిలువుము. రాదగదు అని నుడివె. నుడువగా సావిత్రీదేవి అమ్మహాత్మునింగని యమపాలా, నాచిత్తంబు పతిచరణాంబుజంబులందు లీనమైయుండ, అట్టి భర్తవియోగంబు నెటు సేతు. దేవా, యెవ్వారైన నేడుమాటలు నీతో నాడ నేర్చినట్టివారలు నీకుం జుట్టంబులు, ధరణీసురు లేడువరంబులును, క్షత్రియులు నాలుగువరంబులును, వైశ్యులు రెండువరంబులును, శూద్రుడొక వరంబు నడుగందగు కావున నంతకా నేనింకొక వరంబడుగందగుదానననిపల్క, పల్కనెడ అవురా, నీపతిభక్తికి మెచ్చితి త్రిలోకంబులం గొనియాడదగు నీసద్గుణాలాపంబునకు సంతసించితి యోభామామణీ నీకిష్టంబగు మఱియొక వరంబడుగుము యిచ్చెదనని పలికె. పలుకగా నా ధర్మచారిణి శ్రార్ద్ధదేవా, యింతకుమున్ను నా ప్రాణనాథుని జీవంబుతప్ప వేఱొక్కవరం బడుగనుందునా. ఇదివరకు నా పతి బ్రతుకువినా అన్నివరంబుల నిచ్చితివి యిప్పు డట్టి 'మగనుదక్క' అను మాటమఱచి యెట్టివరంబైన నడుగుమంటివి ఇది నాభాగ్యము. సతులకు పురుషవిరహంబుకంటె దుస్సహంబగు కష్టంబొకటికలదే, పతినెడబాసి నవేనుక యీ బ్రతుకేల కావున మహిషవాహనా భర్తవియోగ చింతావలంబును నీకరుణామృతవృష్టిం జల్లజేసి నా ప్రాణనాధుని లబ్జీవితునిం జేసి నాకొసంగవె దేవా అని మృదుకిరకిసలయంబుల నతనిపాదంబులం బట్టె, పట్టునెడ నతండు కాంతామణీ నీనాలాపంబులకు మనసుకరిగె యో పతివ్రతాశిరోమణీ వగవకుము. నీకు మోదంబలర నీమగని బ్రతికించితి.

యింధనమున్మ్రుక్కై యొక యెండ్రమ్రానింజేల్చుటయు జేల్చ నెడబడలిగడ
గడవణకుచుచేయున్న వనుపుంగ్రింద బాలున్నెంచి మ్రానునుండి దిగుటయు
సతనిదనతోడ దలగడంగావించి నిద్రపుచ్చనెడ యముండునచ్చి కాలపా
శముల జీవమునుబట్టిగట్టి యమపురమునకుంగొనిపోవునెడ దానునుఅ
తనితోడంజని ప్రార్థించి తానువలసిన నాలుగువరములవిధంబులను దెలిపె
తెలుపగా వారలు ఓరా నాతల్లి యెంతటి మహాత్కార్యముచేసితివి.
నీమహిమంగొనియాడ వేనోళ్ళుగల యాదిశేషునకై ననలవియేయనిగొని
యాడుచుండు నెడ సత్యవంతునితల్లి సావిత్రింజేరదీసి తొడపై కూర్చుండ
బెట్టిచుంచుదుఃఖ దుఃఖంబుపుణికి ముద్దిడిమేనునిమిరి నాకులదీపమా,
ఆపద్బాంధవులారా, నాతల్లి యెంతపనిచేసితివని మెచ్చె అట్లుండునెడ సాళ్వ
దేశమునుండి మంత్రులును, బంధువులును, పురజనులులోనగు వారు
చతురంగ బలములంగూడి పుణ్యారణ్యమునకువచ్చి అశ్వపతిని సవిన
యముతోచేదోయి మొగిడ్చి దేవా, పగతుడు సర్వజనవిరోధమునవంశ
క్షీణుండై నశించి పడరాని బాములంబడి యమసదనంబునకరిగె. కావున
నీకుంబట్టముగట్టవచ్చితిమని తెలిపి అశ్వపతినింబుత్రుడగు సత్యవంతుని
బట్టపుయేనుగపై నెక్కించి ప్రభుపత్నిసావిత్రుల నాందోళికలంగూర్చుండ
బెట్టి యవ్వనవాసులగు మునివరులను పత్నిసమేతులయి తోడరాటవలి
పటహకాహళభేరిభాంకారశంఖారవములును భూనభోంతరములు భోరు
కొల్పు వేణువీణామృదంగ మద్దళాదివాద్యములును మనోహరములుగా
మ్రోయ మనోరమ్యములగు నృత్యగీతవాద్యములతోడను భూసుర
స్వస్తివాచనములతోడను మునివరుల దీవెనలతోడను భూసురాంగనా
శోభన గీతములతోడను సాళ్వదేశమునకుజని రాజభవనమునొచ్చి
అశ్వపతికి పట్టముగట్టి చిత్రాశ్వునికి యువరాజ్యపట్టముంగట్టి వారు
వారు తమతమ నెలవులకుంజనిరి. అంత వారలు సకలభోగభాగ్యముల
ననుభవింపుచు తుదకు సతీపతులిద్దరు పరమపదవిజెందిరి. కావున
సత్యస్త్రీలకు పతిపూజలే యిహపరసుఖంబుల కాధారము. నీవు నట్టి
పతివ్రతం త్రికరణశుద్ధిగా బూజించితివేని నీకొట్టికొరతయుం గలుగదు
అని చెప్పెను.

సావిత్రీదేవి ప్రభావము - ముగిసెను.



శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## 14 చంద్రవదనాదేవి ప్రభావము.

పూర్వకాలమున కాశ్మీరదేశమునేలుచుండిన చంద్రశేఖరుఁడను రాజొకఁడుగలఁడు, అతనికిసుగుణంబుల కాటపట్టగుచంద్రవదనయనునార్యకూఁతురుగలదు అప్పుత్రిక మిక్కిలిగారాబమునం బెరిగి చిరుతప్రాయమునందుండియే తనప్రాగ్జన్మపుణ్య వశంబునలభించినజ్ఞానముచేత ప్రపంచమేల్లయనియు ధనకనకవస్తువాహనాదిసంపదలెల్ల మెఱుపుతీఁగెలవంటివనియు కాయంబపాయకరంబనియుపుత్రమిత్రబాంధవులు మొదలగు వారందరు యనుభటులనియు యిట్టిమాయారూపకంబగుప్రపంచసుఖంబుపైనుంచు ఆశయేతనకు కారాపాశమనియు తలంచుచుసచ్చిదానందస్వరూపమునకాధారమగు పరమహంసను నిర్మలమనంబను కాసారమున నోలలాడించుచు శాంతిశమదమాదిసద్గుణ భూషణాంబర శోభితయైశుక్లపక్షమునఁగానసానుజాబిల్లి కోలెనానాట యౌవనమంకురింపఁ దొడఁగినచ్చెలులంగూడి అట్టివారికి తత్త్వమార్గమున దేశించుచు సత్కథలంబ్రొద్దుపుచ్చుచుబంగారుమేడం దగుపనసుణోమయాంతఃపురమున వెలుంగుచుండె

స్త్రీలు గలరే యని చిన్నబోయిన వదనంబులతో నొప్పులం బారిన నెమ్మో గంబులతో మనమీ రాజకన్యను మనయూరికిం గొనిపోదుమేని యి మ్మహనీయ నెమ్మోగము కళాహీనమై చిన్నబోయి డెందంబునం బాలి పతి విరహమున గుందుగాక యని యోర్వలేనితనంబున నందరును బ్రబోవు నమయమునకుం గొనిపోయి వారివారి నియత కాలములయందతని విడిచి భోగించుచుండిరి. అట్లుండ నిట విందాఖ్యుడెఱింగి అయ్యో ఇది యేమి మాయా, ఈ దేవస్త్రీలు నన్ను మోసపుచ్చి మాయోపాయమునతని ఉయ్యాలకుం దెచ్చుకొని నే పతివ్రతాశిరోమణియగు చంద్రవదన యేమ గునో విషాదము నెంత గుందుచుండునో యనుకొనుచుండె.

పిమ్మట చంద్రవదనయు చిత్రాంగదయు నంతఃపురాంతరమున లేచి యాయుత్పాటును సాచి తన భర్తను గానక చింతించి చిత్రాంగద చంద్రవదనం జూచి చెల్లెలా, అయ్యో, ప్రాణనాథుడిప్పుడు మనపాంతనుండి యింతలో నేమయ్యెనో యని మిక్కిలి విచారమునొంది నిద్రాహారములేక పతివిర హోద్వేగమానసులయి నెవ్వగం గుందుచు మూడుదినములయ్యె డనివసించియుండి అంతట నాట్టఫుసాని చంద్రవదనం జూచి యువ్వెగునమ్మా మనమిట్లు విగాని పతివిరహమున సహించనేల నా పుట్టినిల్లయిదుగో సమీ పముననే యున్నది. జాగు సేయక మనముచ్చటికిం బోయి నాతండ్రికి వర్త మానంబు జెప్పితిమేని యతడు పలుదిక్కులకుం జారులబంపి మన ప్రాణ నాథుని వెదకి తెప్పించును గనుక రావమ్మా పోదమనియె.

అనగానే చంద్రవదన అక్కా, మన ప్రాణనాథుండిట లేనితఱి మనమెట్టికార్యమునయిన స్వేచ్ఛజేయరాదు, మనయెడల పతివ్రతాధర్మ మువిడకురదు నేఁడు ప్రాణేశ్వరుం డేలరాడు త్రొల్లి వరుణదేవుకూతురు త్రిలోకమోహినియనుదాని మగని సవతిం గొనిపోగా నట్టివాని తన పాతివ్రత్యప్రభావమున నామె తెచ్చుకొనలేదా నాబుద్ధి నూహింపగా మన ప్రాణనాయకుడు స్వర్గలోకమున నున్నట్లు తెలియవచ్చుచున్నది. నీకిష్టమయినయెడల పుట్టింటికి బోవలెనని పలుకగా నా చిత్రాంగద యా చంద్రవదనం జూచి యక్కా, నిను నేవిడచి నొంటరిగా పోను కావున వచ్చునే గాని పలికి తత్క్షణమున కాశ్మీరపాంచాలాంధ్రదేశమునకు జని జరిగిన వర్తమానమంతయు చారులచే చెప్పించె.

అట్టిసమయమున చంద్రవదన సమాధినిష్ఠంబూని పంచేంద్రియ వ్యాపారములుడిచి పతిపదారవిందములు డెందమునసిడి తన్మయత్వము జెంది ముప్పదియొనిమిదిదినము లుండునంత నాయువతి పాతివ్రత్యప్రభావమున ప్రళయకాలానలంబునగిది జాజ్వల్యమానమున సప్తప్రపంచ దశదిశలుం బొగలెగచి దేవలోకంబంటి తరిగొనసాగె. అప్పుడు దేవతలెల్లనాయుసలజ్వాలలకోర్వలేక దేవేంద్రుని మొఱబెట్టగా యింద్రుండంతట ఆహా, మనస్వర్గమునకేమో మోసమువచ్చె. అకటా! ఈయుష్ణతాపమునకోర్వలేనే యీశ్వరాయుని దివ్యదృష్టింగనుగొనునంత యిది భూలోకమునందగు నొకపతివ్రతా ప్రభావమునంగలిగి యున్నట్లుగని యెఱింగి దేవవేశ్యల తక్షణమ్ము పిలిచి వారలం దనుపు విందాఖ్యుని పుష్పక విమానమున గూర్చుండబెట్టుకొని అష్టదిక్పాలకుల తోడం గూడి ఆయరణ్యమునకువచ్చి విందాఖ్యుని పిలిచి చంద్రవదనకు నమస్కరించి తల్లీ యిదునో భర్తఁగోల్పోయితివి యీసమాధినిష్ఠ చాలించి నీ కృపాకటాక్షముంగని మాయగ్నిత మముజ్జోర్వవేయని పలువిధముల పొగడి అంతనాచంద్రవదనాదేవి సమాధినిష్ఠ చాలించినయగనం దెఱచి విందాఖ్యుని గని పాదపద్మములకు మ్రొక్కి అర్ఘ్యపాద్యాదివిధులు బూజించగ వారు యీ పతివ్రతా ప్రభావమునకును ఆమెచేయు నుపచారములకు యీ పతివ్రత ననేకవిధముల బొగడి నాకలోకమునకుబోయిచేరిరి.

అట్టిసమయమున రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ యను వేల్పువెలయాండ్రు అప్రణ్యాపరిపక్వములపయిబడి మనసొగ్గుంబెఱుగక నిట్లుచేసితిమి, మా యపరాధముల మదింబెట్టి మమ్ము క్షమింతువేమో యనిదగులుజెందెదము తల్లి. మానెరిఁగునసయిచి కృపాకటాక్షమున చూడవేయని పలువిధముల ప్రార్థించి యామె సెలవుపుచ్చుకొనిస్వర్గమునకుపోయిచేరిరి అటుపిమ్మట విందాఖ్యుడు చిత్రాంగదను, చంద్రవదనం దోడ్కొని చతురంగబలసమేతుండయి కోలాహలమున నాంధ్ర దేశమునకు జని తండ్రిచే నయ్యాంధ్ర దేశమునకును పట్టాభిషిక్తుడై చాలాకాలము నేలుచు అష్టయిశ్వర్యములం దులదూగి యంతట పతిప్రతులు మోక్షసామ్రాజ్యము బొందిరని ద్రౌపదిసత్యభామకుంజెప్పె

నూర్యుండు వెక్కుడలంగానంబడియు నొక్కడయిన తెరంగు ననతండు సర్వగతుండయ్యును ఖిన్నుండుగాడు. తత్వవిదులయిన పెద్దలుతమలోన పరమాత్మస్వరూపంబున నున్న యాశ్వరుని యున్వేభింబున నెరుంగుదురు జీవాత్మకువరుండయిన నర్వనుయుండు తనమాయచే విశ్వంబుసృజయిం పగోరిరజంబున గ్రిడింపంగోరి సత్వంబునని ద్రింపగోరితమంబును త్పాదిం చిచరమయిన కాలంబున సృజియింపుచున ట్టికాలమున నీశ్వరుండు సర్వసర్వ నుండయిదాలాహ్వయుండయిసాత్వికస్వభావులగుసాధుదనబృందములకు సాయుజ్యపదవియు రజస్తమోగుణంబుల నావేశించుదుష్టజనులకు హిం సయుం జేయుచుండు దూషణభూషణతిరస్కారంబులు శరీరంబునకుగాని పరమాత్మకు లేవు. శరీరాభిమానంబునం జేసిదండకావాక్పారుష్యంబులు హింసమొత్తోచు తెరంగున నేనునాయదియనియెడు స్నైషమ్యంబుభూతం బులకు శరీరంబునం దేసంభవించు నభిమానంబుబంధంబునిరభిమానం డయినవధించినవధంబుగాదు. కర్తృత్వమ్మునివారికిహింసయుసిద్ధంపమున ర్వభూతాత్మకుండగు నీశ్వరునివియునునస్య బులేదు. ఈశ్వరమూర్తియైన కాలంబునం జేసి వృక్షంబుగలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థానవృద్ధినా శక్షీణత్వపరిపాకనాశనంబులు ప్రాప్తంబులయినతెరంగున షడ్భావవికారం బులు దేహంబునకేగాని యాత్మకు లేవు. ఆత్మనిత్యుండు. క్షయరహితుండు శుద్ధుండు. క్షేత్రుండు. గనాదులకాశ్రయుండు క్రియాశూన్యుండు. స్వ ప్రకాశుండు. వృష్టిహేతువు. వ్యాపకుండు నిస్సంగుడు. పరిపూర్ణుండు చొక్కండుయని యాత్మలక్షణంబులు పంద్రెండు నెరుంగుచు దేహాదులం దు మోహాజనకంబులగు అహంకారమమకారములవిడిచి పసిండిగనులుగల నెలవునవిభ్రాజమానంబులగుగనక లేశంబుల పాషాణములందు ఘట్టం బు పెట్టితిహ్నయోగంబు నంగరనూది హేమకారకుండు పాటవంబున బంగారముంబడియుచందంబున నాత్మస్మృతకార్యకారణంబుల నెఱింగినే ర్పరదేహంబునం దాత్మసిద్ధికొరకునైనం యుపాయంబునం జేసి బ్రహ్మ ప్రభానంబునవడయు మూలప్రకృతియు మహదహంకారంబును పంచ తన్మాత్రలయివియెనిమిదియును ప్రకృతిగుణంబులనియు, కర్మేంద్రియం బులయినవాక్పాణిపాదపాయూపస్థలును జ్ఞానేంద్రియంబులయిన శ్రవణ సయునరసనాత్వఘ్రాణంబులును మనంబును మహీానలిల తేజో వాయుగగ

నములును నివిపదార్థును వికారంబు నియు సాక్షిత్వంబు వీని నిరువయి
యేకింటిని నాత్మ కూటియుండు పెక్కంటి కూటుచ దేహము అదియును
జంగమస్థావరంబులును రెండు రూపంబులు మూలప్రకృతి మొదలయిన
వర్గంబులజావేరయినుణిగణములంగూడియున్న సంగళసూత్రమునందం
బున ఆత్మయిన్నిటియందుజొచ్చి జీవించు ఆత్మ కజన్మనిత్యలయములుగల
వనిమిథ్యాతత్పురుషులుగాక ఏలేకశుద్ధమైనమనముపచారించి దేహం
మునందాత్మ వెదకవలయు. యాత్మకు నవనలు కలిగినట్టుండుగానియునవ
లేమాత్రము లేవు. జాగరణ, స్వప్న, సుషుప్తులును వృత్తు బెన్నడిచేత
నెరుంగంబడునో అతడుఆత్మయనిచెప్పుదురు. కుసుమధర్మములైనగ్రం
ధముల చేతగంధాశ్రయుండయిన వాయువునెఱింగెడు భంగి త్రిగుణాత్మక
ములయికర్మజన్మములయిన బుద్ధిభేదములు నాత్మ మెఱుంగందగు. ఈసం
సారముబుద్ధిసాధ్యముగుణకర్మగణబద్ధము అజ్ఞానమునకుయాంరణముసంసా
రమునకుకలసంటిదిగాని నిక్కముగాదు సర్వార్థకములు మనమ్మువలన
బుట్టునని స్వప్నజాగరములునమములు గుణశూన్యంబగుపరమాత్మకు
గుణసంయోగమువలన జననమరణములు పాటిల్లినట్లుంటు పట్టిచూచిన
నేమాత్రము లేదు. త్రిగుణాత్మకములయిన కర్మములకుజనకమయివచ్చు
చుండు. అజ్ఞానముఅనుమాటవి జ్ఞానమును వహ్నిచేగాల్చి కర్మవిరహి
తులయి పరమాత్మంగనుట మేలు,

రాగాది యుక్తమనస్కుండయి శరీరికి సంసారనివర్తకంబయిన
పరమాత్మధ్యానముబ్రహ్మానందకలినిర్వాణసుఖ మహనీయులందగుభగవ
ద్ధ్యానంబునకెనమముగాదు పరమాత్మునకు సకలహృదయములందును
అంతర్యామియై ఆకాశమునగిదినుండు విమయార్థనమువలన నెయ్యెడి
యొక్కటియు లేదు .నిమిషభంగురప్రాణులరైనమర్త్యులకుమహాపాత
ములగుచు బలములయిన పుత్రమిత్రకళత్రపశుభృత్యబలబంధురాజ్య
కోశమణిమందిరసుత్రిసూతంగగృహప్రముఖ విభవంములుననిరర్థక
ములుయాగప్రముఖపుణ్యలబ్ధములయిన స్వర్గాదిలోకభోగములుక్షీణం
బులుఅవినిత్యములుగావు నతండువిద్వాంసుండునని యభిమానించికర్మం
బులుగోరక చేయునలయు గోరిచేసిదుఃఖఫలములు సంప్రాప్తములగు
చుండు దేహముకొఱకుభోగమున పీడించు దేహమునిత్యముగాదు

తోడరాదు. మృతుడయిన దేహమును శునకాదులుభక్షించు దేహార్థములాచరించి కర్మబద్ధుండయి మరలగర్భానుకూలమ్మైన దేహము దాల్చు అజ్ఞానముజేసి పురుషుండు కర్మదేహములని స్మరించుధర్మార్థకామములు జ్ఞానతంత్రములు జ్ఞానలభ్యము మోక్షము మోక్షప్రదాతయగు సకలభూతములగు నాత్మస్వరూపుండు ప్రియుండు తనచేతవయిన మహాభూతములతోడ జీవసృష్టుండయియుండుసిద్ధములయిహృదయగతుండైన పరబ్రహ్మమునునిజభక్తింభజింపనగును. యువతులకుపురుషులకు నట్టి పరమాత్మస్వరూపుండు స్త్రీలకుభర్తయైనావయినం నాస్తినాస్తి నసింవయా అను సద్వచనముచొప్పున పతినేదైవముగభావించినపతివ్రతాసతియు సర్వలాభసమృద్ధిగామును సాధుజనసంగమమును నిత్యవ్రతమానసమారాధనమును భక్తిత్త్వమును పతియుండెడి ప్రేమయు భక్తిగుణకమః కథానామసంకీర్తనమును, పతిపాదకమలధ్యానమును పతిపిలోకనపూజనములును మొదలునునవి మోక్షహేతువులు. జ్ఞానవయిరాగ్యలాభసాధనములయిన సాధుజనముపయిరతిగలిగిన. నచేభక్త్యాపదారవిందధ్యానము మోక్షసాధనంపనిమొంచి భక్తిచేయుచుండుదువేసర్వనరాస్త్రపరిహిత శాశ్వతపుణ్యలోకంగను కయివల్యమునిచ్చుచునని జెప్పి యతింపంతర్హితుండయ్యె,

అంతటనాసుమతీదేవి బ్రహ్మానందపరవశురాలయి యింటికివచ్చి సదాభక్తపదారవిందధ్యానముసేయుచుండగా కౌశికుండు సకలుంబున లంజగృహమునన ండి యింటికివచ్చి దురాచారుండయి పుషార్థపరుండైంతయుంగాక కొన్నిదినములుండి కడకుతినుటకన్నము కట్టుట వస్త్రమును లేక మిక్కిలివిచారమునొంది యొక్కనాడుభార్యంజూచి యోసీ! దుష్టురాలా, ఎల్లకాలము అతిథియభ్యాగతులకుపెట్టి కొంపకొల్లబెట్టిలుపకు నన్నిగలిచేసితివి. యికనేనయూరకయుండను గాన నీ సొమ్ములొయిచ్చిమెత్తజీవించెదను. నీవెక్కడికిబోక భద్రముగాసేయుండుమని చెప్పె. చెప్పగా నామెప్రాణేశ్వరా! మీరునన్నుదెబ్బిచినన నేయింటనెట్లుంట మనసుబుట్టు కటకటా! ప్రాణనాథా! దినదినపాపముల పాలంబుచ్చి నేనుప్రేమసుఖముగనింటనుండి దినొకజన్మమే కష్టసుఖములుభయాధీనములు, పట్టినట్లుయుండగపలదే దవా! మీరలిట్టిపోవకు. యెట్టి

అట్లుండగా సుమతి పతివ్రతాప్రభావమున భగవంతుండాయడవి లోనిరేంచువారల ప్రేరేపింపగా వారుఆదారినివచ్చియగాపుత్తరమానం బోతుంగిపుంతనావిప్రుని యరణ్యమున వెదకినట్టియతనిబెదరించి వానిచే నామొకట్లువిప్పించి యికనయిననీభార్యను యింటికెంటబెట్టుకొనిపోయి సుఖమునవుంపుము, లేనియెడల నిన్నుచంపుదుమనితర్జనగర్జనములనత్యు పదలించి స్వేచ్ఛలబోయిరి. అంతనాభూసురుండు దొంగలచేతనుచెంచు వాండ్రచేతను నవమానితుడయినుమటివారలనుదలంచుచుచింతాక్రాం తుడయిచెనుతప్పుంపున భార్యనువిడిచిపోనెంచె, అట్లుతలచియుతనయత్నం బేమియుకొనసాగకపోయినందున మిక్కిలివిచారమునొంది యెంతవిచా రముబొందెనో అంతతెలివిపుట్టి ఛీఛీ! యీజన్మమేటికని తనలోదాను గొంకి గతిలేనివానికివేంట్రామేలంజ యనుసామెతననుసరించి మరల భా ర్యవద్దికిపోయియిదిసాధారణమైనదికాదు. పతివ్రతాశిరోమణియైయుండ వచ్చునని తలచి ప్రియురాలా! రాకపూర్వమని మిక్కిలి నేత్రములతోదే బట్టి మెంటనయ్యాటలలోనామొందోడాని యొకబ్రాహ్మణఅగ్రహార మునకుబోయి నచ్చట కొన్నిదినములుండి పిమ్మటప్రియులారా, ఇచ్చ టనుండి మరినెంపయిన సోదమునిమంటిమేని భోజనమునకు యేమిగతి యనియడిగె అనుగగాదేవా! బుద్ధికి వగపంబనిలేదు. మీకెట్టికాఅత లేకమిస్సగాను. ధయిర్యముగనుండుమని తృప్తిబఱచి నొకబ్రాహ్మణు సంఘమునికితేసుకొని అగ్రహారముకంగక బ్రాహ్మణగృహముల పచన మొదలగు పనులంజేయుచు మిక్కిలి విశ్వాసభూతయయితానుభర్తయు సుఖముగ కాలము గడుపుచుండిరి,

అట్లుండగా నొక్కనాటిరాత్రి యావిప్రుండు, క॥ కనకపుసింహా సనమున । శునకముగూర్చుండబెట్టిశుభలగ్నమునం। దొనరగబట్టముగట్టి న । వెనుకటిగుణమేలమానునవరాసుమతి॥ అన్నట్టుగాతనకొంటిగుణము మానకనాయగ్రహారమునుండిసెకుదోసెను పరహామునకుపోయిప్రియు రాలా రెండుమూడుదినములలో సెకుదోసెను వరహాలిత్తునవిగోజారిగడ్డ ముంబట్టియేమో నీవుణ్యమని యారాత్రిదానితో కూడి తెల్లవారుటకు ముందు యొసరెకుగకొండమునునుగిడి తిన్నగానింటికివచ్చెను. నచ్చినదిన ముమొదలు చలిజ్వరము, చేతులుకాళ్లుపట్టుకొనుట మొదలగు వ్యాధు

కూడి మెలఁగను యీశ్వరాయని స్వామీ! ఇన్నాళ్ళుబ్రతికి తుదకుడుసి నొంటరిగా విడచి చావవలసినన్నను. ఇది యెక్కడిలేనిపనిది. దీనికినాగే తండ్రి నావెనుక దీనిపుత్రికలలో నొక్కతెగాభావించి పోషింపుమ నుభారముమీఁదనిడి పేరెలుంగున నేడ్వఁ బలికెను. అటుల వాపోవుచుండఁగ నింజూచి ప్రాణేశ్వరా! భయపడవలదని ధైర్యముజెప్పి ఆయింటి గొప్ప ఋషిజూచి తండ్రీ! సూర్యోదయము గాకుండునటుల మునిశాపమునకు ప్రతిశాపమిచ్చియున్నాను. భయపడనేల? అటు నాశపథమువలన ప్రళయమగునేని మిన్నువిరిగి బడు. చుక్కలుపటపట రాలు. భూమియుగడ గడవణకు. త్రిమూర్తులు మొదలగు దేవతలు చీకాకుపడుదురు. మహా ప్రళయమువెంటనే కలుగు. దృష్టాంతముచూడుము. నాపాతివ్రత్యము మహిమయనిచెప్పె, చెప్పునంతలనాబ్రాహ్మణుడును యింటివారునునాహా! లోకమునకీపతివ్రతా శిరోమణిగలదా యని యాశ్చర్యపడిప్రాక్కు నుజూచుచుండిరి, సూర్యుం డాబ్రాహ్మణశాపమునకునోడి యెనిమిదినముల వరకు వుదయముగాకయుండె.

అంతట ముముక్షువులును, దేవతలు, మహర్షులు మొదలగు ప్రాణులందఱు సల్లకల్లోలబడి యీబ్రాహ్మణపత్నిదగ్గరకువచ్చి తల్లీ! నీపాతివ్రత్యప్రభావమునకు మెచ్చితిమి. మూఁడులోకములు క్షోభించి సూర్యోదయము లేకుండుటకై అయ్యో! ప్రళయమువచ్చునేమొయని జీవులు విసుకు కొనుచున్నవి. మృగములును పక్షులును యేమియు దోఁచక కృశించు చుచున్నవి. సస్యములు నశించుచున్నయవిగనుక తల్లీ! యికనైన ననుగ్రహించి సూర్యోదయముగునటుల జేసి మమ్ముద్ధరింపుములని ప్రార్థించిరి. ఆ సుమతియు నట్టివారల వాక్యములకరఁగి ఆహా, నేడు నాపాతివ్రత్యమహిమంబున మీదర్శనమయ్యె నింతకంటె నాకేమిభాగ్యము కావలెను. నా నోముఫలించి వ శము పావనమయ్యె నమస్కారముగా మాండవ్యమహర్షి పతికిశాపమిచ్చుటం జేసి నేను ప్రతిశాపమిచ్చితి. అందువలన నట్టియవస్థలు పుట్టె అయినను మీకట్టిభయమువలదని పతిపాదములు ధ్యానించి సూర్యోదయమగుగాకయనిపలికె. పలుకునంతలో సూర్యోదయమునయ్యె, అంత నాత్రిమూర్తులు నామె ప్రభావము ననేకవిధముల బొగడి యాబ్రాహ్మణునకు దీర్ఘాయువును, సుఖమారోగ్యమును. ఇచ్చి

శ్వర్యములును గలుగునటుల దీవించి యంతర్ధానమైరి.

తరువాతనాయగ్రహారీకులు మొదలగులోకులందరునీమెపతిభక్తికి మెచ్చియనేకవిధములనామెంబొగడిరి. అది మొదలామెయుపతిప్రాణనాథుడగుకౌశికునిగూడి ధనకనకవస్తువాహనములు మొదలగు సంపదలంగొఱవడక ననుభవించుచు ననేకదినములకువెనుక భర్తతోడ మోక్షసామ్రాజ్యపదవింబొందె గావున సత్యా ఒకపతివ్రతకంటె మఱియొక్కపతివ్రతామహాత్మ్యమెట్లున్నది. చూచితే కావున నీకైన నిన్నుగనిగౌరవించి త్రికరణశుద్ధిగాబూజించి యతనిమాటకడ్డమాడక సంతోషముంబొందునటుల మెలగియుండునేని నీకెట్టికొదువయుం గలుగదని చెప్పె. అనగా యింతులుతమపతులనుదైవముగాదలచి వారికెపుడు సక ప్రదితములే జేయుచు హితముబల్కుచు గౌరవములు జూపుచుయుండుస్త్రీ పతివ్రతలకు సాటియని యెఱుంగవలయును,

సుమతీదేవి ప్రభావము - ముగిసెను.



శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యమను

# శ్రీ భక్తవిజయము.

## 15 సురభీదేవి ప్రభావము.

అనేకదినములక్రిందట కనకపురియనుపేరుగలయొకపట్టణముండెను, అందొకబ్రాహ్మణుండుండె. అతనికి సద్గుణాలంకారిణియు వివిధవిద్యావిశారదయునగు సురభియనునొకపుత్రికయుండె. ఆబాలికయొక్కనాడు తండ్రింజూచి నాయనా! లోకమున స్త్రీలుయేవిధమున పుణ్యలోకముంబడయుదురు. నాకెఱింగింపవేయనియడుగగా నతండాపుత్రింజూచి తల్లీ! లోకమునంగల వ్రతములన్నిటిలో భర్తృవ్రతమే దొడ్డవ్రతము. అటు

పంటిప్రతానుష్ఠానముననే సతులకు పుణ్యలోకములు కలుగును అని పలికె. పలుకగా తండ్రీ! యేవిధమున పాతివ్రత్యము సంపాదింపనగు దానినియు మమెటువంటిది, సంసార తాపత్రయమునంబడి వేదన జెందు నీజీవునకు జననమరణములు లేని మోక్షపదవి యెవ్విధమున సంప్రాప్తంబగు. దానిం జెప్పవే యని యామె యడిగెను.

అనగా సతండా పుత్రింజూచి అమ్మా! నీమనంబును దేనియందు చలింపనీయక దృఢచిత్తురాలవై వినుము. యోగమునందు మృదుమధ్య మధికములని మూడువిధములు. ఈమృదుమధ్యసాధకము లొకటికంటె యొకటి విశేషముగానుండు. ఈశ్వరోపాసకులు విధిహితంబగు కర్మము లాచరించ భక్తితో నీశ్వరార్పణముని చేతురేని త్వరలోనటువంటివారికి యోగము సిద్ధించు. అవిద్యాదిక్లేశములు, పుణ్యపాపమిశ్రకర్మములు. జాత్యాయుర్భోగములు, చిత్తమునందు వాసనారూపములుగనుండు సంస్కారములు వీటిచేతనున్ను కాలత్రయములచేతనున్ను బాధపడనివాడెవడో అటువంటివాడే యీశ్వరుడనబడును. ఆయీశ్వరుడు సర్వజ్ఞుడనుటకు హేతువగలదు కావున యీశ్వరుడొక్కడున్నాడని చెప్పుటకు ముఖ్యప్రమాణమున్నది. ఆయీశ్వరుడు త్రికాలములచే బాధింపబడనివాడగుట వలన బ్రహ్మాదులగు వారికిగూడ గురువై యున్నాడు. అటువంటియీశ్వరునకు ఓంకారమే ప్రణవము, నామధేయము మూడున్నరమాత్రముగల ఓంకారముయొక్క జపము చేయుటయును, దానియర్థమును భావించుటయు నుపాసనమనబడును. మూడున్నరమాత్రయనగా, అ.ఉ.మ.అర్ధమాత్ర యని కూడిన ఓంకారమును పదేపదే చింతించుట జపమనబడును, దాని యర్థము భావించుట యనగా ఓంకారార్థప్రదుడైన యీశ్వరుని ధ్యానించుట యనబడును. కర్మములు, విహితము, వేదాభ్యాసము, పురాణ యితిహాసముల పఠనము, సాధుజనపూజనము మొదలగునవి, నిషిద్ధకర్మములనగా పరహింసాస్పదములగు కార్యములజేయుట మొదలయినవి. మూఢకర్మమనగా మిశ్రకర్మ పుణ్యపాపములతోడ సంబంధించినవి. ఈశ్వరుని జెప్పెడు ఓంకారజపమువలన చిన్మాత్రుడయిన పురుషునియొక్క విఘ్నములు తొలగును. జ్ఞానము లభించును. తనకంటె వేరయిన యీశ్వరుని ధ్యానించుటవలన ఆత్మసాక్షాత్కార మెటులకలు

తమని పెక్కువిధంబుల నామెనుఁ బొగడి యా బెస్తవానిఁ బ్రతికించి యా సముద్రంబును యెప్పటివలె జేసి జలజంతువులఁ బ్రతికింపుమని ప్రార్థించిరి. ప్రార్థింపగా నాపతివ్రత సముద్రుని యెప్పటివలెనే జేసి నీటిజంతువులను బ్రతికించె. అంత స్త్రీమూర్తులు ఆమె ప్రభావంబునకు యాశ్చర్యపడి దేవతలతోటి తమతమ నెలవులకుం బోయి చేరిరి. కావున నేఁడును అటువంటిగనీ బ్రతికించి తెచ్చుకొనుటయొండె. లేక నేనైన ప్రాణంబుల విడుచుటయొండెయనిరలవాకుం దెల్పి యాక్షణంబున పద్మాసీనయై యాచమనంబు జేసి పతిపదారవిందంబులు చిత్తంబున నిడి త్రేతాగ్నులనొక్కటింజేసి వానితోటి తనపతివ్రతా యోగాగ్నిం గూర్చి విస్తరిల్లజేసి యయ్యగ్నులచే సముద్రజలమంతయుం బీల్చి జలచరంబులకు ఉపద్రవంబు కలిగించుచుండె.

అట్లుండగా యాదేశపు రాజు యాసంగతి విని సముద్రతీరంబునకు వచ్చి సురభీదేవిం జూచి యాశ్చర్యపడి ఆమెకు యెండతగలకుండ పందిళ్ళు వేయించి కొందఱుభటులను ఆమెకు కాపలియుంచి అప్పటికప్పటిసమాచారంబున ప్పుడప్పుడు రాపించుకొనుచుండెను. ఇట్లుండగా ఆదేవి పతివ్రతాగ్ని పెనుమంటలతో పయికినెగసి విపులపటుత్వంబుతో సముద్రంబు పయిబడి సముద్రజలంబునంతయు శోషింపజేయుచుండె. అంతసముద్రుండాయగ్నివేదనకోర్వలేక తనబుడుచు చారులవలన జరిగిన సమాచారంబంతయునవి స్వరంబుగా యెఱిఁగి తనపుత్రికయగు సరసయుండు బోధంబునకుం బోయి తల్లీ! నీవుచేసినకార్యంబువలన ప్రమాదంబు కలిగి లోకులందరు చిందఅవంశకులయయ్యగ్నితాపంబున పరితపించుచున్నారు. ఆశ అందల మొక్కపలెననియున్నది అన్నటులు తల్లి' నీవేసాటి. సుంభదేవి యేపాటి. ఆమెపతివ్రతాశిరోమణియె. అట్టిదానినుగనినీవు చేపట్టతగునా ఆమ్మా, చేపట్టినా అతడునీకబ్బునా బంగరుబొమ్మ ఇంతపట్టుకు అనుభవించినది చాలును యింక సతనివిడిచిపెట్టుమమ్మా యని ప్రార్థింపగా యాసరస సముద్రునింజూచి తండ్రీ! నాప్రాణస్థాప నేనిత్తునేగాని ఈనాభర్తను నేనెంతమాత్రంబు విడువను అని పట్టినపట్టు వదలకుండె. అట్టిపుత్రిని సామవచనంబున సమాధానపఱచి అతనిని విడిచిపెట్టవమ్మా యని వేడగా నాయనా నన్నుగూడతోడ్కొనిచని యాసురభీదేవిని స్వాధీనపఱపుము లేకుంటే నేనెంతమాత్రము బబ్బ విడువననిపలికె, పలుకగా నేసముద్రుడంత

నట్టియగ్నిదత్తునితోడ సరసనుం దోడ్కొని సముద్రపుగట్టుకు వచ్చి సమాధి నిష్ఠనుండు సురభీదేవింజూచి నమస్కరించి పలువిధంబుల బొగడి తల్లీ! యిదిగో నీభర్త. కనుదెరచి చూడుము. కోపాగ్నిచల్లార్చి నీకృపాకటాక్షంబుల మమ్ముంజల్లపరుపవే తల్లీ! యని ప్రార్థింపగా యామె విష్ఠం బాలించి కనులు రదెరచిచూచె.

అంత నాసముద్రుండు తనకూతురగు సరసను యామె పాదంబులకు మ్రొక్కించి అమ్మా ఇదిగో భర్త ఇమ్మాగో యిదినాపుత్రిక దీని పేరుసరస దీనిని స్వాధీనపఱచితిని. దీనిని నీతోగూడబుట్టిన చెల్లెలుగా నెంచి మన్నింపుము అని యనేకదివ్యరత్నంబులతో నామెను పూజించి దివ్యవాద్యంబులతో మహోత్సవంబు సేయించి తననెలవునకుంబోయె.

అంతలో నీవర్తమానంబును చారులచే నాయూరిరాజునినిమ్మంగళవాక్యంబులతోడవచ్చి యాపతివ్రతకు నమస్కరించి అనేకవిధంబుల బొగడి అగ్నిదత్తుని పట్టనాగపేపయినెక్కించి అందలంబున సురభీదేవిని సరసనుం గూర్చుండజేసి మహోత్సవంబుతో తనపట్టణంబునకు గొనిపోయి తన చెంతబెట్టుకొని ధనకనక వస్తువాహనాది భోగభాగ్యంబుల వారల దేలించుచుండె.

అంత నాసురభీదేవియు సరసయుం దమ మిక్కిలి విశ్వాసంబుగలిగి తనతోబుట్టిన చెల్లెలికంటె నధికగారాబంబున ప్రేమించుచు ననేకదినంబులుభూలోకమందుండి అష్టయిశ్వర్యంబులనుభవించి తుదకు తనభర్తయుదానును మోక్షసామ్రాజ్యపదపదంబోయి చేరిరి.

సరసయు తనతండ్రియగు సముద్రునిచెంతంబోయి చేరి పూర్వంబువలెనే మెలగుచుండె అనగా యింతులు తమపతులను దైవంబుగా దలచి వారికెపుడొనక వుచితంబులే జేయుచు హితంబులు బల్కుచు గౌరవంబులు చూపుచుయుండుట పతివ్రతులకు నూటియని యెరుంగవలయును.

సురభీదేవి ప్రభావము - ముగిసెను.

—( )—

శ్రీ ర స్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీ భ క్త వి జ య ము.

## 17. ప్రభావతీదేవి ప్రభావము.

పూర్వము పాటలిపురమును ధర్మమార్గమున నేలుచుండిన చంద్రశేఖరుండను సూర్యవంశపురాజొక్కరుండుగలడు. అతనికి ప్రభావతి యను నొకపుత్రికామణికలదు. ఆమె తన బాల్యప్రాయమునుండి సహజంబగు జ్ఞానసంపత్తికలదియు, వేదశాస్త్ర పురాణేతిహాసధర్మములను పతివ్రతాధర్మమును ఆదిసద్గ్రంథములను నెఱింగి జగజ్జేగీయమానంబగు సుగుణముల కాటపట్టయి రూపురేఖా లావణ్య సౌందర్యాది విభవముల నతిశయించియుండె

ఇట్లుండంగా కొన్నిదినములకు ప్రభావతికి యౌవనము ప్రాప్తమయ్యె. అంత నా చంద్రశేఖరుం డాకుమారిం జూచి నాతల్లీ యొకనికి నిన్ను వివాహము చేయవలసిన సమయము వచ్చెను గనుక యెట్టి గుణములుగలవాని నీవు వరింపనిష్టపడెదవో నీ యభిప్రాయము బహిరంగించినచో నేను అట్టివానిని వెదకి కొనితెచ్చి మహోత్సవముగా నీకు పెండ్లిజేసెదనని పలికె. పలుకగానే ప్రభావతి తండ్రీ, లోకములో సతికితగినపతియును, పతికితగినసతియును సమకూడుట మిక్కిలిదుర్లభము కావున నాకువివాహమే అక్కరలేదు. సదాకాలమును నేను పురాణేతిహాసశ్రవణ పరమానందముతోను, పతివ్రతా కథాశ్రవణానందముతోడను ప్రొద్దుపుచ్చుచు పునరావృత్తిరహితమగు మోక్షపదవికిం బోయెదనని దృఢముగబల్కె. అంత నా రాజశేఖరుం డావచనములు తన ప్రాణనాయికకిం దెల్పి అదిమొదలు అయ్యో, నాకుబిడ్డలులేకయుండి యున్నాళ్ళకు భగవంతుడనుగ్రహమున నిట్టి పుత్రికపుట్టె. పుట్టినప్పటినుండి మహోన్నతపదవి బొందినటుల నేనేమో బ్రహ్మానందపరవశుండనై వంశమునకు కొడుకైననదే కూతురైననదే యని మిగుల గారాబముగా బెంచి నేటికాలానికి పక్కానినయునిం

గూర్చియుక్తుఁడగువానికి విద్యచేసి సంతోషముబొందుదుమని యెంతో ఆశకలిగియుండగా నాకుపెండ్లియే యక్కఱలేదని వైరాగ్యమున్నదే. ఇకయేమిసేయవచ్చు నీశ్వరాయని యన్నమునీరు నంటక అహోరాత్రములు మిగుల మనోవ్యాకులమున వ్రశించుచుండె.

అట్లుండగా లోకనాథ మునిశ్రేష్ఠుండగు నారదుడు చంద్రశేఖరుండున్నయెడకువచ్చి యతనిచే సత్కారములువడసి యుచితాసనమున గూర్చుండి యోరాజా, కుశలమేమియని యడిగె. అడుగగా రాజు మునివరా, ముల్లోకములుగల వర్తమానములెల్లను మీకు మనోగోచరములయియుండ నేనేమనిచెప్పందగువాడనని విశేష చింతాక్రాంతచిత్తుండై కరకమలములు ముకుళించి యూరకనిలిచియుండె. అట్లుండు భూపతింజూచి నరేంద్రా, నీపుత్రి నావివాహమునకయి నం భర్తృవాంఛగలదానిం జేసెద. ధైర్యమునవుండుమని పల్కి ప్రభావతియున్న సౌధమునకుం జని యామె చేయుచున్న పాద్యాదివిధులం బూజలందు తగిన పీఠమునంగూర్చుండి ప్రభావతీ, చతురాశ్రమములలో గృహస్థాశ్రమమే శ్రేష్టము. అట్టి యాశ్రమమునందుండి పతిని దైవస్వరూపముగ భావించి మనోవాక్కాయకర్మముల నొక్కరీతిగా పతిని వివిధోపచారముల పూజింపుచు సదా పతిపదారవిందముల భక్తియే యిహపరలోకసుఖములం బొందుటకు మార్గమని తలచి అట్టిపురుషునిచే మహత్తత్త్వరములనెఱిగి పతిచరణారవిందస్మరణమునం బ్రొద్దుపుచ్చురేని అట్టివారికి మోక్షపదవి ముంగొంగు బంగారమువంటిది యగునే గాక మఱియొకవిధమున నెంతమాత్రము గడతేరలేరు. కావున నీవు వివాహము చేసుకొని అట్టిపురుషునివలన సద్గతిగాంచగలదానవు అని పలికి యంత సన్నగవనగుచును స్వేచ్ఛం జనె. అంత నారాజపుత్రి యున్నయెడకుం జని అమ్మా, మహనీయుండగు అరివేరంపు తపసిపలుకులు వింటికదా. ఇకనయిన నట్టి వైరాగ్యమునుమాని పెండ్లిచేసుకొన సమ్మతించుము అని పలికె. పలుకగా ప్రభావతి యాతనిం జూచి తండ్రీ, వేదశాస్త్రపురాణేతిహాసధర్మములను, మహత్తత్త్వరములను నెఱింగి మిక్కిలి వివేకపరుడై శాంతశమదమాది గుణంబులతో సదా దేశాటనము సలుపుచుండు నవాండెవడో అట్టివానిం దప్ప మఱియొకని నేపెండ్లియాడను వాక్రుచ్చె.

ఇట్లుండగా మగధ దేశ రాజపుత్రుండగు చిత్రకరుం డనువాడు సకల శృతిస్మృతిపురాణేతిహాససద్గ్రంథముల నెరుగుచు యొల్లప్రాయమున నుండి దేశదేశములు తిరిగి పూర్వపుణ్యవశమున నాపాటలీపురమునకువచ్చి అచ్చటి వారిచే ప్రభావతి వర్తమానమునంతయు విన్నవిని సంతోషించి యా రాజమందిరమునకుం జని యతనిచే గౌరవింపబడి యంత తన వర్తమానమునుం దనమనమునయున్న యభిప్రాయమును దెలియఁజెప్పె. పిదప నారాజు చిత్రకరుని పరిపూర్ణరూపలావణ్య విద్యాప్రభావమును నతని శుభలక్షణములును గని సంతసించి యావర్తమానమును వివరముగ ప్రభావతి కెఱింగించె.

ఇట్లుండ ప్రభావతి యంత నతనివర్తమానమువిని సమ్మతించె. అంత నారాజు శుభముహూర్తమున ప్రభావతి నతని కిచ్చి సంతోషముగా పెండ్లిచేసి పెండ్లియైనది మొదలు ప్రభావతియుపతిని బ్రహ్మస్వరూపముగాభావించి షోడశోపచారముల నతనింబూజించుచు నతనిచే సకలపరమార్థములు నెఱుంగుచు రాత్రింబగలును పతిపదారవిందధ్యానముసేయుచుండె, చిత్రకరుండును ప్రభావతిదేవియొక్క గుణాతిశయంబులకు భక్తివిశ్వాసములకునుమెచ్చి కొన్నిదినములుఅత్తవారింటనుండి పిమ్మట ప్రభావతిదేవియొక్క పతిభక్తియెట్టిదియో పరీక్షించవలెనని యొక్కనాడు భార్యంజూచి ప్రాణకాంతా! ఇకను దేశమునకుపోదము రమ్మని పల్కి అత్తమామలకు నమస్కరించి వారిచే సెలవుపుచ్చుకొని ప్రభావతి నొకగుఱ్ఱమెక్కి తానునొకయశ్వముపై నెక్కి మగధదేశమునకుపోవుచు మార్గమునందగు నరణ్యములయందు వినోదముగా మృగముల వేటాడుచు, కమలాకరములం జలక్రీడలాడుచు నట్టివనప్రదేశముల వివిధసుఖములనుభవింపుచు అచ్చటిపుష్పఫలవృక్షంబులమచ్చటయు, పక్షివిశేషముల శ్రవణానందకరమగు స్వరములను "గంటేవింటే" యని ప్రియముగలిగించును. ఒకనాటిరాత్రియవ్వనమున నొకవృక్షము క్రిందసుఖముగాపరుండి యొకటెరుంగని నిదురం జెందిరి. అంతనాచిత్రాకరుండర్ధరాత్రంబున లేచి ప్రభావతిగాఢముగనిదురపోవుట యెరింగినక నిమిషమునందు ప్రభావతీప్రభావతీయని మూడుపర్యాయములు పిలిచి ఆమెపలుకకుండిన దానినొకనరముగానెంచి యిదేసమయమని తలచి

బాహానెక్కి వాయువేగమనోవేగంబున మగధదేశంబునకుం బోయిచేరె.

ఇక్కడ ప్రభావతి చిత్రకరుండు తన్ను విడిచిపోయినముహూర్త మాత్రంబున లేచి తనప్రక్కను బరుండిన నాథుంగానక చింతించి అవ్వనమంతయు జక్కగా వెదకి యెందును అతడు కానకయుండుటకు మిగులవగచి హా ప్రాణనాథా, యెందరిగితివో, యేమైతివోయని పురుషధ్వని వాపోయి శాంతిసేసటి దైర్యమవలంబించి అతడు మగధదేశంబునకయిపోయియుండ వచ్చునని యోచించి తత్తడి నెక్కి భర్తృచరణసరసీరుహంబులకు స్మరింపుచు మగధదేశంబునకు పోవుచుండె. అట్లు పోవుచుండగా కొందరు దొంగలు హా. యెవతెయో జగన్మోహినీదేవతవలె నియరణ్యంబున సర్వాభరణభూషితురాలయి యొంటరిపాటున నిర్భయంబుగా పోవుచున్నది, ఇదివనదేవతయో, దేవతాస్త్రీయో, కిన్నరస్త్రీయో, అప్సరసయో లేక మనుష్యస్త్రీయోయని యామెచే గటికరుదెంచి యోభామినీ, నీవెవ్వతెవు? యీయర్ధరాత్రంబున ననాథయి గుఱ్ఱము నెక్కి పోవుటకు కారణంబేదయని యడుగగా యామెవారలంజూచి భయపడి గడగడవణకుచు హా ప్రాణనాథా! యేమిసేతునని పతిపదాంబుజంబుల దలచి ప్రణవధ్యానంబుజేసి తటాలున వసమంగళసూత్రంబును దారిపయివిసరివేసె, వేయునంత నది పతివ్రతాప్రభావాగ్ని యగుటచే నప్రళయకాలాగ్నిన తె వారిపయిబడి వారందఱు భస్మీకృతమొనర్చుటయు ప్రభావతిచెంతకువచ్చి చేరె. అంతనామాంగళ్యమునుగట్టుకొని అశ్వారోహయయియనేక వనంబులు చేసిచని యొక్కప్రదేశంబునందున నొక్కమహాఋషి యాశ్రమంబునకుం బోయి యతనికి నమస్కరించి తాబడుబాములెల్ల తార్కాణముగా నతనికివివరించినిలువగా నతండా దేవియింగితి దివ్యదృష్టివలన చిత్రకరుని వర్తమానంబును నామె విసాదంబునకు గారణంబు నెరిగి తల్లీ! భయపడకుము. నీప్రాణనాథుండగు చిత్రకరుండు మగధదేశంబున సురక్షితంబుగ నున్నవాడు. నీవునుం బతివ్రతాశిరోమణివి. నీమనోధర్మంబెరుంగంగలచి నీప్రాణేశ్వరుం డిట్లు నిన్నలయించిచనియె దయిర్యంబున నుండుము. పతిభక్తినేమరకుము. మానభూషిణీ! అని జీవనుక్తికృపాయంబుజెప్పి మునికన్యలచే నామెకు వివిధోపచారంబులం జేయించుచు తన యాశ్రమంబునం బట్టుకొనియుండె,

అట్లు చిత్రకరుండు తనపురము చేరి తనతల్లిదండ్రులకు తా నుచంద్రప్రాయణము భూమి చుట్టివచ్చుడ జరిగినవిధము మొదలుగా జరిగినసంగతులనెల్ల విశదముగా జెప్పె. తెలుపగా వారతనిం జూచి యీదుర్గుడా ఆహా, ఇట్టిమానవతియు గుణభూషణియు పరమపతివ్రతయునగు ప్రభావతిని యిట్లు యవమానపరచి యొంటరిగా విడచి రాదగునా, ఇట్టి ఘోరకృత్యంబు నెవరయినను యిదివరకు జేసిరా, ఇట్టి లోకనిందను మనమెట్లు భరింపగనవచ్చు యని మిక్కిలి వ్యసనాక్రాంతచిత్తురాలై యుండిరి. చిత్రకరుండును దానుం జేసిన యన్యాయకృత్యమునకయి తలపోసి తలపోసి బుద్ధిభ్రమచే పిచ్చివాడయి తిరుగుచుండెను.

అంత నక్కడ ప్రభావతి ఆమునీంద్రుని చెంత కొన్ని దినంబులుండి. మహా తత్త్వజ్ఞాన పరిపాకంబునుం బొంది యంతట నొక్కనాడు తనదివ్య వస్త్రాభరణాదుల నెల్ల నమ్ముని పాదపద్మంబునకు సమర్పణ జేసి మునీంద్రా! లోకంబున నెట్టివారికయిన ధనకనకవస్తువాహనంబులే విపత్తు కలిగించుట కాధారమయియున్నది. యట్టిధనాపేక్షను విడిచినవారికట్టి భయముగలుగదు. కావున యికనే భయంబులేక మగధదేశంబునకుం బోయివచ్చెద, నాయందనుగ్రహంబుంచి సెలవిండనిపలికెను. పలుకగానె యోగసద్గుణాలంకారిణీ, సర్వసంగపరిత్యాగులమైయుండవలసిన కుర్వాక యిట్టియుక్తవుం లోచెట్లపుట్టలచెంతవసించి జీవన్ముక్తయితపంబుగావించు మాబోటిమునులకు యిట్టివస్త్రాభరణంబులతో పనియేల! ఇవిమాచెంతనుంచుకొన్న యెడల మానిలువనములకును హానిగలుగు గావున యోచంద్రముఖీ! భయపడకుముయని యామెకు రక్షకరకయి స్వహస్తాగ్రంబులుబోధించి గాని నిక్కట్టి భయంబుగలుగక సుఖంబుగ మీయూరికిపోయి చేరుదువు గాకయనిదీవించి యామెనంత తనయాశ్రమంబున నుండి వెడలనంపె.

అంత ప్రభావతి యమ్మునివరునిచే ననుజ్ఞాతయై అశ్వంబునెక్కి సురక్షితంబుగ మగధదేశంబునకుం బోయి యూరువెలపల అశ్వంబుడిగ్గి మాభలవస్త్రాభరణంబుల నలంకరించుకొని యాపట్టణంబున నుండువారల నాయూరినతెఱంగునంబువిచారింపగా శత్రువులు వచ్చి తమదేశంబును పట్టుకొని యేలుచుండ నట్లును, చిత్రకరుండును బుద్ధిభ్రమణంబున పిచ్చివాడయితిరుగుచున్నాడనియు వినిని తత్క్షణంబున పతిచరణారవిందంబులజెం

దండంబున నిడి ప్రణవాంగంబునగు పంచాక్షరంబు నొక్క [illegible] స్మరించినమాత్రంబున కోట్లకొలది రథగజతురగపదాతులును, పట్టిసముసలఖడ్గశక్తితోమర కోదండాదిశస్త్రాయుధంబులును సృష్టియయ్యె. నంతశత్రురాజు అట్టి వాహినులం బోలు వాహినులం గని బలవంతుడైనవాడు తనపురంబునకుం దండెత్తి వచ్చెనని తలంచి కాలుసేతులు తడబడ వెక్కలి భయాక్రాంతచిత్తుండై యాక్షణంబున సపత్నీపుత్రమిత్రబాంధవులతో కలుములన్నిం బాసి పరాజితుండయ్యె.

అంతట ప్రభావతి నిర్భయంబుగా పురంబులోనికి జొచ్చి రాజమాతయుండు మేడకుంబోయి ఆమెకు నమస్కరించి తనవర్తమానంబును దనప్రాణనాథునికి దెలియంజెప్పె. చెప్పినంత యామె ప్రభావతిం జేరదీసి శాంతిగూర్చం బట్టుకొని ముద్దిడుచు నమ్మతల్లీ, మాకులదీపమా, పతివ్రతారత్నమా, విచారపడవలదని ధయిర్యంబు జెప్పి పరదేశరాజుచేత పట్టణము గోల్పోయి తాముబడరాని బాములపడుచుండుటయు చిత్రకరుండు తాచేసిన దుష్కృత్యంబు తలచి తలచి ఖిన్నుడయి పిచ్చిపట్టినవాడై తిరుగుచుండుటయు మొదలగు తమకష్టంబులనెల్ల జెప్పె. చెప్పగానే ప్రభావతి తక్షణంబున చిత్రకరుండున్న యెడకుంజని యతనిచరణారవిందంబులకు మ్రొక్కెడి పాతివ్రత్యప్రభావంబున నతనిమతిభ్రమణంబుకు బోగొట్టి యామెచే నతనికి పట్టముగట్టించి వివిధోపచారంబుల నతని సంతోషపెట్టుచు త్రైలోకంబుల నిట్టి పతివ్రతాతిలకంబుగలదాయని కీర్తి నంది పెక్కువేలసంవత్సరంబులు ధనకనక వస్తువాహనంబులు మొదలగు అష్టయిశ్వర్యంబులం దులతూగి తుదకు భర్తసహగమనంబు గావించి యెట్టివారికి నందరాని కయివల్యపదవిం బొందె.

అనగా యింతులు తమతమపతులను దైవంబుగా దలచి వారికెవ్వరికేనను వుచితంబులే చేయుచు హితంబులు బల్కుచు గౌరవంబులుజూపుచుయుండుటే పతివ్రతలగు సూటియని యెఱుంగవలయును.

ప్రభావతీదేవి ప్రభావము - ముగిసెను.





శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యము



# శ్రీ భక్త విజయము.

## 18 సుముఖీదేవి ప్రభావము.

పూర్వంబు సింహపురికి పశ్చిమ ప్రాంతంబున కుమ్మరపల్లె యొకటి కలదు, అందు శుద్ధసాధుండను కుమ్మరి యొక్కడు కలడు. అతడు అనేక దినంబులనుండి బిడ్డలు లేక లేక ముదుసలి ప్రాయంబున నొక పుత్రిం బనియించె. దాని ముఖంబున శోభనరేఖ యొప్పియుండుటం జేసి యాబిడ్డకు సుముఖి యను పేరు బెట్టి మిక్కిలి గారాబంబుతో పెంచుచునుండిరి, ఆ సుముఖి చిఱుత ప్రాయంబునుండి తలితండ్రులకు ముద్దుగూర్చుచు శాంత శమదమాది సుగుణంబుల నభ్యసించుచు వారిమాటలవినదాటక తోన యీడు బాలికలతో నాటపాటలం బ్రొద్దుపుచ్చక గృహకృత్యంబులనెల్ల నొప్పుగ జేయుచు శుద్ధసాధుని పుత్రి లోకంబులోని బిడ్డవలె తన యీడు వారలంగలసి మాట్లాడదు ఏవరితో ముద్దుముద్దుగ మాట్లాడక యున్నా దంబు పట్టినదానివలెనుండుటం గని. ఇన్నాళ్ళకు సెలవుగా మంచిమాదిమి ప్రాయంబున పుట్టక నేటికాల ని! అతివికిటువంటి బిడ్డ పుట్టవలెనా? ఇట్టి

బిడ్డయుండియేమి లేకయేమి దీనినెవరు పెండ్లి జేసుకొందురు మనియూరి
వారందరు జెప్పుకొనుచుండిరి.

అట్లు చెప్పుకొనుచుండు మాటలనాసుకరివిని యీపుత్రికచేష్ట
యునట్లుండుటంగని చింతాక్రాంతచిత్తుడయియీశ్వరా, ఇట్టిమొద్దుపిల్ల
మనకుపుట్టవలెనా, ఇట్టిదానికి నాప్రాణమున్నపుడే పెండ్లి జేయుటసం
చిది. నావెనుక దీని నెవడు పెండ్లిజేసికొనడని తలచి తనబంధువులలో
చక్కనివాని నొకనిదెచ్చి యాకూతునని నతనికిచ్చి వివాహంబొనర్చి
తనకు మొగబిడ్డలులేనందున వానినే పుత్రునిగాభావించి తన యింట
తనకు మొగబిడ్డలులేనందున వానినే పుత్రునిగాభావించి తన యింట
బెటుకొని ప్రేమతోపోషించి కులవిద్యయగు కులాలకవృత్తినేర్పుచునుండె
కొన్నిదినములకు శుద్ధసాధుండు మృతిబొందె, అంతట సుముఖి భర్తకా
యగు మందప్రజ్ఞుడు భార్యం జూచి యోసీ' మీతండ్రియున్నంతవరకు మన
కేమివిచారములేక నతనిసంరక్షణవల్ల మిక్కిలి గారాబముగా కాలము
గడుపుచుంటిమి. అతడు మనదురదృష్టంబున కాలగతిబొందె. నీవునామం
దబుద్ధివి. నేను మందప్రజ్ఞుడను. యేపనిపాటులేక మనము సోమరులవలె నున
మూరకయుంటిమేని మనలపోషించువారొక్కరులేరు గనుక నీవు నసలు
గురితోపాటు మనబంధువులతోడంజని పూరిపెలువలనుండు మంచిజిగ
టమన్నగంపలనెత్తుకొనివచ్చితివేని నేనీకుండలు మొదలుగునవి చేసి వా
టినివిక్రయించి దానిచేతనసంసారకృత్యము జరుపుకొనవచ్చునని పల్కె.
పలుకగానే సుముఖిభర్తయనుమతిచొప్పున బంధువులతోడంజని మంచి
జిగటమన్నగంపలనెత్తుకొని ప్రతిదినము తెచ్చి యిచ్చుచుండగా మంద
ప్రజ్ఞుడు భాండాదులంగావించి దానివల్లజీవించుచుండెను. అట్లుండగా
నొక్కనాడాసుముఖి మట్టిగంపనెత్తికొనివచ్చునెడ బరువుమోయలేక
తటాలున క్రిందపడవయిచి యత్యాక్రోశం గూర్చుండి యీశ్వరా, యింత
బరువునేమోయలేనే యీమట్టిపోనిదిగాని యింట నతనిపని జరుగదే
యని యేడ్చుచుండెను. అట్లు యేడ్చుచుండు దాని కూడవచ్చిన బం
ధువులయినను నాదరింపరయిరి, తిరిగిచూడకనుం బోయిరి.

ఇట్లుండగా సుముఖిచే భాగ్యవశంబున నకస్మాత్తుగాయాదారిని
గౌతమమహర్షివచ్చుచుండి యాచిన్నదానింజూచి యేలయేడ్చెదవు నా

తల్లీ! తెలుపవేయమ్మా యని యడిగెను. అడుగగా సుముఖి యామునికి నమస్కరించి తనముగనివర్తిపూర్వానంబును, తనవర్తమానంబును, తమయింటంగల కష్టసుఖంబులు సకలము నెఱింగించె. అంత నాగాత్రముం డక్కాంతామణింగని బాలా, తొలిజామున నివ్వుసహాయముగ మునిశ్రేష్ఠులకు నుపచారంబులు జేయుచుంటివి అట్లుండియు వారివలనజన్మసాఫల్యంబులగు సద్విషయంబులుం గ్రహింపవయితివి అందువలననీకిట్టి జన్మముకలిగి మిక్కిలికష్టమొనంగెదవనిపలికె. పలుకునంత నాసుముఖి మునీంద్రా! ఇట్టి జననమరణంబులేక జీవన్ముక్తి కలుగు నుపాయంబెద్దియో వానినెఱింగించి నన్నుంగృతకృత్యురాలం జేయవేయని ప్రార్థింప గానతండామగువకునష్టాంగయోగము తెలిపి యాకుశాగ్రమతీ, నీవిట్టుపతిసేవయుక్తవని భావించి అతనినసేకవిధములబూజింపుము పతిపదారవిందభజనమే మోక్షసాధనమనియెంచి అట్టిచరణకమలంబుల ధ్యానమునందుచిత్తమును స్థిరముగానిలుపుదువేని నీకిట్టిసంకటములుండంబోవు. అదియునుంగాక పరమహంసస్వరూపమగు పరబ్రహ్మమును నిజకరతలామలకమువంటిదియగు అండపిండబ్రహ్మాండములను నీమాయను నీసంకల్పముననుండును. నీవే శుద్ధబ్రహ్మస్వరూపంబగుదువు అని పల్కి దీవించి యథేచ్ఛంజనియె

అంత నాసుముఖి యమ్మహాముని యుపదేశమువడసి పతిచరణసరసీరుహమ్ము ధ్యానమున నిలిపి యాగింప నంత తృణప్రాయముగా నెత్తినంబెట్టుకొనియింటికివచ్చుచుండగా తలపైనుండు నాగంప తలకుతగలక తలకుసరిగాపయినవచ్చుచుండె. అట్టి గంపతోడ సుముఖి యింటికివచ్చి దానింబట్టిఅనాయాసముగా దిగువంబెట్టి దారిలోజరిగినవర్తమానం బంతయుపతికెఱింగించి పతిపదములకుమ్రొక్కి యతనిచే సెలవుబుచ్చుకొని వంటశాలకరిగి నిమిషమాత్రమున షడ్రసోపేతముగ నన్నము నాయత్తపఱచి పతి కారగింపంజేసి పతిభుక్తాన్నశేషమును తానుంగుడిచియు తనకుప్రియముగనడచుచు ప్రతిదినముచాలినంతమున్నదెచ్చి భాండములకనుకూలంబగు పిసికియిచ్చి యతడుభాండంబులంగావించినంతట దానినావమునంబెట్టి మూడుపిడకిలావంబునంబెట్టి పక్వతోపభాండములంగట్టుకొని ప్రభావాగ్నిచే దావిలంపహించి తాభాండములంగట్టుకొని యూరిలోనికింబోయి దానిసి

విక్రయించి వేగముననింటికివచ్చి పచనముగావించి మానసికస్నానంబిడి గోతెమును బ్రహ్మాండానలెచ్చిన యోగాసనముల నభ్యసింపుచు పతిపదారవిందముల భగవన్నామస్మరణముతో జపించి పిదప పతిభుక్తాన్నశేషంబుగుడిచి యతనికనుకూలములగు పనుల జేయుచునుండెను.

ఒక్కనాడట్టిసుముఖి యెప్పటివలె స్వజాతిస్త్రీలంగూడి మన్నుదెచ్చుటకుబోగా దారిననొకపెన్నేటిప్రవాహంబడ్డంబై వీరలంబోనియక నడ్డపడగా కుమ్మరస్త్రీలందరు విచారగ్రస్తులై ఓయక్కా! ఓచెల్లె! ఓపిల్లా! ఓపదినా! ఈవేళచీకటిలో లేచి ఎవరిముఖమును జూచితిమో వారిముఖాన మొస్సలుపెట్టాయని తిట్టుకొనుచు మఱలతమతమయిండ్లకుబోవ ప్రయత్నమైరి. అట్లుండగా నాసుముఖియట్టివారింజూచి అక్కలారా! మీరేల విచారపడెదరు. నాతోటి నిర్భయముగరండని పతివ్రతాప్రభావమున నాయేటివాళ్లువలలోదిగ్గానంతలో యీయేమహాత్మ్యమునకు మెచ్చి యాయేటివెల్లువ రెండుప్రక్కల ప్రత్యేకంబుగనిలిచి నడుమనిశ్శల్యలోకిబోవ దారినిచ్చె. అంతనాస్త్రీలు సుముఖితోడంగూడి చని బంకమట్టి నెత్తుకొని యామెపాతివ్రత్యప్రభావంబున కాశ్చర్యపడి అనేకవిధంబులం బొగడుచునిండ్లవచ్చిచేరి యీవృత్తాంతమును యూరివారలకుం దెల్పగావారందఱుసోదరా! సుముఖిచిన్ననాటనుండి అంతమొద్దుగా, మూగగానుండె గదా, అట్టిదాని కెట్టిసామర్థ్యముగలిగెనని చోద్యపడుచుండగా నావర్తమానము కులాలకులమునకొకపెద్దమనగాడగు పెద్దశెట్టికిం దెల్పి యతడు తనభార్యయు మిక్కిలి యాశ్చర్యపడి ఆమె ప్రభావము పరీక్షింపం దలచి యీపెద్దశెట్టి యొక్కనాడు కొందఱు కుమ్మరస్త్రీలను సుముఖియింటికిబంపి ఆ యూరిదేవునికి ఉత్సవంబు జరుగుచున్నది దేవునిచూచివత్తము కొల్లవేడుకగానున్నది. పోయిచూచి వత్తమురమ్మా అని పిలువమని పల్కి పలుకగా వారలామెను అట్లు పిలచిరి. అట్టిసమయంబున నామె తన పురుషునికి యుపచారముచేయుచుండి తల్లులారా! నాకు రాదీరదు. నా దేవుడు నాయింటనేయున్నాడని వారినివెడలనంపె. వారు మఱలజని యీవృత్తాంతమునతనికెరుంగింపగా ఆ శెట్టి మిగుల యాశ్చర్యంబొందె.

అట్లుండగా మఱియొకనాడు ఆయూరిరాజు యీసుముఖిదంపతి

కుండలు తెచ్చియిచ్చు కుమ్మరిదిరాగా నే కుండలు
నిరూకలనియ్యక దానితో నీమాటఆమాటమాట్లాడి మూ
...నములవరకు ప్రొద్దుపుచ్చుచుండుమని ప్రభువృతన కెఱింగింపమని పలికినట్లు జెప్పె. అంత నా పట్టపుదొరసాని మరునాడుదయమున నాకుమ్మరిదికుండలు తేగా బేరమాడిభాండములం గొన్నిపుచ్చుకొని వాటిక్రయమియ్యక నా సుముఖింజూచి తల్లీ! నిన్నులోకులందరు చిన్ననాటనుండి మిక్కిలి మందమతియనియు, మూగయనియు వాడుకొనుచుండిరిగదా! అంతంతవరదేవతెలోలె అనేకయద్భుతకార్యములం జేయుచుండెదవు. నీకిట్టిమహిమ యేవిధమునగలిగెనో చెప్పుమని యనేకవిధములనామెను పొగడుచు ఆ సుముఖివలన పతివ్రతాధర్మము లెఱుంగుచు ననేక విషయంబుల మాటలాడుచు ప్రొద్దుపుచ్చుచుండె.

అట్లుండగా సుముఖియారాణింజూచి తల్లీ! చాలా ప్రొద్దెక్కినది? ఝామున్నర ప్రొద్దాయె నాభర్తయింటియందు మిక్కిలి యాకలిగొనియుండు. త్వరగా నేనింటికింజని వచనముగావించి యతనికన్నమారగించవలెకావున నాభాండములమూల్యంబునిచ్చి నన్ను వెడలనంపవమ్మా యనిపలికె. అట్లువినియు నాదేవి యిదోనిచ్చెదనని కాలయాపనమొనర్చుటంగని నేడఝామున్నరకు సరిగానింటికిపోవలెనని తలచి యాక్షణంబుననాతి పదారవిందములనాత్మందలచి సూర్యుని ప్రతిదినమట్టుసంచరింపనీక నిలిపె. నట్టిసమయమున నాభూమిసురుడుఘటికాయంత్రము దాపునం బెట్టుకొని ఘడియలు లెక్కపెట్టుకొనుచుండగ నప్పుడు మూడున్నరఝామునంబు ప్రొద్దెక్కె అట్లుప్రొద్దెక్కియు సూర్యుని నిడఝామున్నరకాలముననేయుండె. ఉండగా రాజు అట్టి యద్భుతంబుగని నామె పతివ్రతాప్రభావమునకుసంతోషించి సూర్యునియిటువటుకదలనియ్యకుండుటకయిమెచ్చియామె కేవలముశుద్ధబ్రహ్మస్వరూపంబని భావించి యాక్షణంబున నవమణిమయంబులగు పల్లకిలోనంగూర్చుండబెట్టి భేరిభాంకారాది ధ్వనులు మిన్నుపిక్కటిల్ల మ్రోయుగా మహోత్సవంబున నాపత్న్యవతకె యూరేగింపు గావించి ధనకనకవస్తువాహనంబులు మొదలగు కానుకలతో నామెనతనయింటవదలి మందప్రజ్ఞనాలింగనముచేసికొని. యనేకవిధములంగొనియాడి యాదినముమొదలు జీవిత

కాలమునరకు వారల కెట్టి కొరతయు లేక నన్ను-
చుండెను.

అంతనా సుముఖీదేవి మందప్రజ్ఞం గూడి అనేకదినములు భూలోకమున సకలభోగభాగ్యములనుభవించి ప్రాణావసానకాలమున పరమపదవింబొందె. గావున సాత్రాజితీ, నీవు నట్టిపతిభక్తిచే మరకసతిపిఅతని మనంబునకు ప్రియంబును సంతోషమును కలిగించుచుందువేని నీవు సుముఖీదేవిప్రభావముకంటె నతిశయించిన ప్రభావముగలదానవై యిహలోకమునదెల్లవారిచే సత్కీర్తివడసి పరలోకమున శాశ్వతబ్రహ్మానంద పదవింబొంది మహాత్మ్యఖ్యాంబుధినోలలాడుచుండెదవనిపలికె. పలుకగా సత్యభామ పాంచాలింజూచి వదినా! నీవు సాక్షాత్పరబ్రహ్మస్వరూపము గాకుందువేని యిట్టి పరమపతివ్రతాప్రభావములనెల్ల నెరుంగనేర్తునే, ఆహా, నీమహిమ నేమందును. తల్లీ, యిట్టిపుణ్యకథాశ్రవణంబున నా కుపులకింపుపుట్టించె. నాచిత్తమునకు పరమానందంబయ్యె నాయాశాపాశము లనుభవబంధములును యొకటొకటిగనూడి పరమపదవికింబోవుట కొక్కొక్క సోపానపుమెట్లు ప్రాప్తమయ్యె. నే నింతకంటె మించిన సుకృతంబును మఱియొకటి సంపాదించవలెనేని నాయమ్మా, ఇకనవ్వలి కథావృత్తాంతమును సాంగోపాంగముగ నెరిగించి నా యజ్ఞానంబుడిని ధన్యురాలం జేయవేయని వేడుటయు.

అనగా యింతులు తమతమ పతులను దైవముగాదలచి వారికెదు రొక్కనక వుచితము లేజేయుచు హింసలు లుడుచు గౌరవములు చూపుచుయుండు లే పతివ్రతలకు నూటియుని యెఱుంగవలయు.

సు ము ఖీ దే వి ప్ర భా వ ము.

ము గి సె ను.



శ్రీరస్తు.

మహాపతివ్రతామాహాత్మ్యంబను

# స్త్రీభక్తవిజయము.



## 19. పుష్పవేణీదేవి ప్రభావము.

సత్యా! పుష్పవేణీప్రభావము జెప్పెదవినుము. ఇదికడపటికథ. దీనిని అనన్యచింతాసక్తురాలవై వినుము. పూర్వకాలమందు చోళదేశమునకు ముఖ్యమగు పట్టణంబొకటికలదు. దానింగాంచీపురమనిపలుకుదురు, అమ్మహాపురంబును పుష్పరథుండనుజనపాలుండు పాలించుచు ఉండె. అట్టిపుష్పరథునకు చిరకాలమునుండి బిడ్డలులేక తద్దయుంజింతించి అట్టిపురమున శ్రీమత్కామాక్షీ సమేతుడయి నెలకొనియుండు యేకాంబరనాదస్వామింగూర్చిస్వధర్మపత్నీసహితుడయి దీర్ఘతపంబొనర్చుచుండెను. అట్లుండగా నా దంపతులతప ప్రభావమునకుమెచ్చి యొక్కనాడేకాంబరనాథుండు కామాక్షీసమేతంబుగ వృషభవాహనారూఢుండై వారిముంగల ప్రత్యక్షమైవచ్చి నిలిచి ఓపుణ్యశీలులారా, మీమీతప ప్రభావంబునకె మెచ్చితి. ఇక తపముచాలింపుడు. మీకేవరమువలసినవారయి తపంబుం జేసిరి దానినెఱింగింపుడు. మీ మనోరథం బవశ్యంబె దీర్తుననసి తత్కరుణాలోకనలయి తామృతబిందుసందోహములన తృప్తివహింప జల్లార్చుచుంబలికె పలుకగా నవ్వధూవరులు ఆపద్బాంధవులకు సాష్టాంగదండప్రణామములాచరించి నానావిధముల బొగడి యంజలిబద్ధులైనిలిచి ఓ వేల్పులారా! పెద్దకాలమునుండి మేమనపత్యమయియుండుటంజేసి మీకొక పుత్రునిం దయసేయుండని ప్రార్థింపగా బరమేశ్వరుం డానతిపతులంగని మీకొక్క పుత్రిక పుట్టునని పల్కి నత్తోడ నీశ్వరీసహితముగ నదృశ్యుండయ్యె. అంత నయ్యేకాంబరనాథు ననుగ్రహమున వారలకొకపుత్రిక జనియించె. దానికి పుష్పవేణియనిపేరిడిమిక్కిలి గారాబమునబెంచుచు వేదశాస్త్రపురాణేతిహాస ధర్మములనేర్పించుచు నత్యంతప్రేమాతిశయముం బూనుచుండగా ఆకన్యకకుయౌవనమంకురించి అంతఃపురముననుండె.

. యంత పురమునకరిగి పేరోలగంబుండి పురో
..యతనిం గని నమస్కరించి భూసురోత్తమా! నాపుత్త్రి
..పుష్పవతి యౌవనారూఢయై యుండుటంజేసి యింటనింటబెట్టుకొ
నుటపాడిగాదు. దానంజేసి యక్కన్యయను దాహంబొనర్పదలచియుం
డుదాన. సుముహూర్తంబొక్కటినిర్ణయింపుడు అనిపలికి అట్టిశుభరేఖను
దక్షిణమున సకలవిద్యావిశారదుడగు నొక్కపాఠునిచే మాళవదేశపా
లునికిననుపె. అంతనామాళవదేశాధీశుండా శుభపత్త్రికంగొనిపుత్త్రుడగు
సుప్రకాశునకుచూపి వివాహమునకుం దగిన వస్తువులం గూర్చుచుండె.
అట్లుండగా సుప్రకాశుం డానరేంద్రునిజూచి తండ్రీ! త్రిమూర్తు
లగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నం తము తమ యిల్లాండ్రనెట్లుపాసి
యుంటిమేని వారెట్టి యపఖ్యాతి దెత్తురోయను భయముచే శ్వరుడుజటా
జూటమునందును, విష్ణువక్షమందును, బ్రహ్మ నాల్కనందును బెట్టుకొని
యుండెదరు. లోకమున పతివ్రతాశిరోమణియునగు సతిలభించుటదుష్క
రము కావుననాకు పెండ్లియక్కఱ లేదనిపలికి పట్టినపట్టువదలక తమమం
త్త్రికుమారుడగు సునీతిందోడ్కొని యుత్తరదిశంగూర్చి నడచుచుపోవుచు
పోవుమార్గమున మృగముల వేటాడుచు కందమూలఫలములు దిను
చు మహాతపోధనులందర్శించుచు అట్టిమహాత్ములచెంతజని మునులారా!
నన్ను మీశిష్యులలోనొక్కనిగాగయికొనరేయని వేడుచు, తుదకు అచ
లుండను నొక్కమహాముని నిలయమునకుంజని యతని గాంచినమస్క
రించి యనేకవిధముల నుపచారములొనర్చుచు మంత్త్రికుమారుంగూడి
అనేకదినములు శుశ్రూషచేసకుండెను తన్మునివరుండు మెచ్చుకొనునట్లు
నటించి అతనిచే వేదవేదాంతాది పరతత్వము లెఱుంగుచుండె,
అట్లుండగా నచట పుష్పరథమహారాజు మాళవదేశాధీశ్వరుండు
తనకంపిన ప్రత్యుత్తరమునుజూచి విచారపరుడై పత్త్రింజూచితల్లీ! మన
మంపినవివాహపత్త్రిక చేరకమునుపే సుప్రకాశుడుతనకువివాహమక్కర
లేదనివిరక్తిబొంది మంత్త్రికుమారుడగు సునీతితోడ గూడి చాంద్రా
యణముచరింప బోయెనని మనకవ్వార్తవచ్చెననిపల్కి యాకన్యకుపత్త్రికజే
నిచ్చె. ఇయ్యదిగా నాకొన్య గూర్చిన జాడదివి తెలిసి తల్లిదండ్రులంజూచి ఓజననీ
జనకులారా, నేనిక నా భర్తయగు సుప్రకాశునివెదకి తెచ్చుకొనునొ

ప్రకాశుఁడుపుష్పవేణిని, మంత్రికుమారుండగు సునీతిని
నఁబట్టినసమరసైన్యంబులతో నచలగురువుచెంతకుఁజనియతనికినమ
స్కరించి జరిగినవర్తమానంబంతయు నాదిమధ్యాంతంబులుగ యతనికి
ఱింగించిఅతనిచే సెలవంది అచ్చటనుండికదలిసుప్రకాశుండును, పుష్పవేణి
యు, సునీతియుఁగోలాహలంబునసకలసైన్యములతో వచ్చుచుండిరి. అట్లు
వచ్చుచుండువారలవర్తమానమునుచోళదేశపురాజుచారులచేవిని భూరి
భాంకారాదిగొప్పధ్వనులతో రథగజతురగపదాతులతో నెదుర్కొనిబ్ర
హ్మానందంబున తనపురంబునకుందోడ్కొనివచ్చి పుత్రికననేకవిధంబులం
గొనియాడియామెమహత్వంబునకుమెచ్చి బ్రహ్మానందపరవశుండై యుండె,
అట్లుండగా మాళవదేశాధిపతితనపుత్రుండగుసుప్రకాశుఁడిత్తో
డచోళభూపాలుచెంతనుండుట నెఱిఁగి చతురంగబలములతో వేణువీణామృ
దంగాదివాద్యవిశేషంబులతో సకలబంధుపురోహితవిద్వజ్జనకవిగాయకవం
దిమాగధులతో చోళదేశంబులకుజనిసుప్రకాశుంగనియానందించిఅతనివల
నపుష్పవేణివర్తమానంబును దూరాననెఱింగి కోడలినిం జేరదీసి దీవించి
తల్లీ! ఇంతచిన్నప్రాయంబుననేనీకిట్టిపతిభక్తిగలిగియుండుట మేముచేసిపు
ణ్యము "భళిభళి" పుష్పవేణీపతివ్రతాశిరోమణీ? సుగుణభూషణీ? మా
తల్లి! మావంశమునిల్పిమమ్ముద్ధరించితివి. ఇట్టిప్రభావముగల నీవుమాకు
కోడలగుటయేమాభాగ్యము. జన్మపావనంబయ్యె. అని యనేకవిధముల
గొనియాడిచోళభూపాలునికౌఁగలించి పరమానందమున ప్రియవచనంబు
లాడి భూపాలా? ఇకశోభనోద్యోగంబు సేయింపుము అనియానతిచ్చె.

అంత నామాళవరాజు పురమునలంకరింపజేసి సుముహూర్తము
నపుష్పవేణినిసుప్రకాశునకిచ్చి వివాహంబొనర్చి కొన్నిదినంబులు కూ
తునల్లుని దమయింటబెట్టుకొని వెనుక అల్లునకు చతురంగబల ధనకనక
వస్తువాహనాదుల అరణంబొసంగి పుత్రికారత్నంబును ననర్ఘ్యంబులగు
వివిధపదార్థంబులగంతపెట్టి భూరిమంగళవాద్యంబులతో విప్రాశీరవం
బులతో నృత్యగీతవాద్యవిశేషంబుల వారలవెడలనంపె. అంతనా సు
ప్రకాశుండు పుష్పవేణితోడ తనపురంబునకుంజేరి కొన్నిదినములకువె
నుక పట్టాభిషిక్తుండై యనేకదినంబులవరకు రాజ్యపరిపాలనం బొనర్చి
అష్టైశ్వర్యంబుల ననుభవింపుచుండె. పుష్పవేణియు పతిపూజాధురం